# అక్షరమాల

రచన : కోమర్తి నారాయణరావు

ప్రథమ ముద్రణ : 1000 కాపీలు 1992.



ముఖచిత్రం : శ్రీ శిలావీ రాజు

ప్రతులకు : ఇంటి నెం. 333/ 2RT, MIGH
పొట్టి శ్రీరాములు నగర్
హైదరాబాదు-500457.

మూల్యం : రూ 34/-

ముద్రణ : శ్రీ తిరుమల ప్రింటర్స్
ముషీరాబాదు, హైదరాబాదు-500 020.

# స్వీకృతి

ఎమ్.ఆర్. సుబ్రహ్మణ్యం
చీఫ్ జనరల్ మేనేజర్ టెలిఫోన్స్
ఎమ్.టి.ఎన్.ఎల్
న్యూఢిల్లీ

ఈ "అక్షరమాలను" క్షుణ్ణంగా నాలుగైదుసార్లు చదవడం జరిగింది. అవి వివిధ అంశాలపై వ్రాయబడ్డాయి. ఏ కవిత చదివినా దేనికదే ఒక ప్రత్యేకతను సంతరించుకొని వుంది. ఈ కవితలు కేవలం కవితల కోసమే కాకుండా వాటిలో వ్యక్తీకరించిన భావాలను అంటే సమాజానికి తానిచ్చిన సందేశాలను త్రికరణ శుద్ధిగా పాటించి చూపించగల మనోధైర్యం, నైతికబలం గల వ్యక్తి శ్రీ నారాయణరావు. తాను ఆచరించి చూపిస్తున్నందువల్లే పదిమందికీ చెప్పగల సత్తాను అతను కలిగివున్నాడు. ఇందులో సందేహం లేదు.

"జుంటితేనెకన్న, జున్నుకన్న మధురమైన భాష!
పనసతొనలకన్న, పంచదారకన్న తీయనైన భాష!
అదే మన మాతృభాష! తీయని తెలుగు భాష! "

ఈ కవితాసంపుటిలోని చివరి పంక్తులివి. ప్రతితెలుగువాడూ చిరకాలం మననం చేసుకోవలసిన తీయని పలుకులివి. ఎందుచేతనంటే, "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని మన తెలుగుభాషను ఏనాడో ప్రపంచ చరిత్రలోకి ఎక్కించారు దాని ప్రాశస్త్యాన్ని గ్రహించిన కవిపుంగవులు.

అలానే స్త్రీజాతిలో అమ్మకున్న పవిత్రస్థానాన్ని వర్ణిస్తూ -

"అవతార మూర్తి అవతరించడానికి కావాలి ఓ అమ్మ
అతడ్ని పెంచిపోషించడానికీ అవసరం ఓ అమ్మ" అని అమ్మకు అత్యున్నతస్థానాన్ని, యివ్వడం చాలా సముచితంగా వుంది.

సంఘంలో పెద్దమనుషులుగా చెలామణి అవుతూ, చట్టాన్నివాళ్లచేతుల్లోకి తీసుకుని వాళ్ళ దౌర్జన్యం ఎంతవరకూ పోతుందో చెబుతూ -

"న్యాయ స్థానాల్లో దొంగసాక్ష్యాలు పుట్టించి, లేనివాడ్ని ఈ చట్టం ఉరితీయిస్తుంది. అంతేకాకుండా పుష్కలంగా డబ్బున్నవారి చేతిలో, ఈ చట్టమే ఉరితీయబడుతుంది." అని చెప్పడం నేటి సమాజంలో జరుగుతున్న అరాచకానికి నిలువుటద్దం పడుతుంది.

ప్రతిఒక్కరికీ, సమాజంలో తమదైనందిన కార్యక్రమాల్లో ఏదో సంద-

స్థానంలో అనుకోని అనుభూతిగానీ, సంఘటనగానీ కలుగుతూ వుండడం పరిపాటి. ఆ అనుభవాన్ని మాటల్లో అందంగా పొందుపరచడానికి, కొంత భాషా పరిచయం అవసరం. అది అందరికీ అబ్బేదికాదు. శ్రీ నారాయణరావుకు మాత్రం యీ భావాల్ని వ్యక్తీకరించడంలో చక్కని శైలి వుంది. "భావానికి తగిన భాషను, భాషకు తగిన భావాన్ని" చెప్పడం అతనికి బాగా తెలుసు. అందుకే తనమదిలో మెదిలిన భావాలు ఈనాడు, యీ కవితల రూపంలో అల్లుకోబడి మిలమిల మెరుస్తున్నాయి.

ఈ "అక్షరమాల"ను ఎంతో ఆప్యాయతతో నాకు అంకితం చేసిన శ్రీ కోమర్తి నారాయణరావుగారికి నా కృతజ్ఞతలు. దీనిలో నా గురించి వ్రాసిన కవితలు మూడు వున్నాయి. ఈ మూడు కవితల్లోనూ నా గురించి చాలా ఎక్కువగానే వ్రాశారు. అవి, నాపై వారికున్న అవ్యాజ అభిమానానికి తార్కాణాలు.

నిజానికి శ్రీ నారాయణరావును అన్ని కోణాలనుండి చూసి, ఏ విధంగాను అతనిలో స్వార్థం లేదని గ్రహించాను. మంచి హృదయం, మానవత్వం గల మనిషిగా నాకనిపించారు. ఉద్యోగంపట్ల భక్తీ, పనిలో క్రమశిక్షణా, నిస్వార్థవర్తనా కలిగిన వ్యక్తి అనీ, ఏ స్వార్థాన్నీ ఆశించి, యీ కవితా సంపుటిని నాకు అంకితమివ్వడానికి సంకల్పించలేదనీ దృఢంగా నమ్మినమీదటే దీనిని నేను స్వీకరించడానికి అంగీకరించాను.

అతను ఇంకా ఎన్నో మంచి రచనలు చేసి మంచిపేరు తెచ్చుకోవాలని ఆ ఈశ్వరుడు అతనికీ అతని కుటుంబసభ్యులకు చక్కని ఆయుష్షను చల్లని ఆరోగ్యాన్ని ప్రసాదించాలని కోరుకుంటున్నాను.

# విజయోస్తు

వృత్తులూ, ఉద్యోగాలతో నిమిత్తం లేకుండా కొందరు కథాకారులవుతారు, మరి కొందరు కళాకారులౌతారు, ఇంకా కొందరు కవులవుతారు. చదువుకీ, సంస్కారానికీ సంబంధం లేనట్టే జీవికకూ, సృజనశక్తికీ మధ్యకూడా ఎలాంటి సంబంధం లేదు. సరస్వతి కటాక్షించాలిగాని ఎవరిలోనైనా, ఎప్పుడైనా కావ్యాత్మకత, కళాత్మకత మేల్కొనవచ్చు, కార్య సృష్టి జరగవచ్చు.

మిత్రులు శ్రీ కోమర్తి నారాయణరావుగారికి తెలుగు ఉగాది పండుగ సందర్భంగా కవితాత్మకమైన సందేశాలతో గ్రీటింగ్ కార్డ్ పంపే అలవాటు ఉంది. అవిచూసి సొంతంగా చక్కని సందేశాలు రాస్తారని మాత్రమే ఇంతకాలం అనుకొన్నాను. "అక్షరమాల"ను చూసే వరకు ఆయన కవి అని నాకు తెలియదు. మ్యాస్ కమ్యూనికేషన్స్ నా వృత్తి. టెలికమ్యూనికేషన్సు ఆయన వృత్తి. ఇద్దరం ఇరుగూ పొరుగు. బహూకాల పరిచయం ఉన్నప్పటికీ, నిజాయితీ పరుడైన ఒక అధికారిగా సహాయకారిగా, సహృదయుడైన స్నేహితుడుగా నీతిమంతుడైన ఒకపొరుడుగా మాత్రమే ఆయన నాకు తెలుసు.

నేను పత్రికా సంపాదకుడుగా ప్రసిద్ధపత్రికలలో పని చేస్తున్నప్పుడు ఆయన ఎప్పుడూ తన రచనలను గురించి నాకు ఒక్క మాటైనా చెప్పలేదు. చెబితే ప్రచురించమని అడిగినట్లవుతుందని ఆయన అనుకొని ఉండవచ్చు. అది ఆయన ఉత్తమ సంస్కారానికి నిదర్శనం, గొప్ప జీవిత సత్యాలను ఆవిష్కరించిన అనుభవాలు శ్రీ నారాఆయణరావుగారికి రచనలు చేయడానికి ప్రేరణ కలిగించి ఉంటాయి.

"ఎదలో తీయని భావం మొలకెత్తినప్పుడు

"ఆవేశం పొంగినప్పుడు" "ఏదో తెలియని ఆనందం

మెదడులో మెరిసినప్పుడు" అది కవితగా రూపొందుతుందంటారాయన. "గుండె గొంతుక' ' లు కదలాడినభావన కవనంగా రూపొందకతప్పదుమరి. కవి ప్రజలు ఒకటై మెలగాలని నిత్యం ప్రజాశ్రేయస్సును కోరుకోవాలని ప్రజాసమస్యలకు పరిష్కారాలు చూపుతూ ఉండాలని ఆయన అభిప్రాయం. ఈ యోగ్యతలన్నీ శ్రీ నారాయణరావుగారిలో ఉన్నాయి.

"జనతలో మమత ఏపుగా పెరగాలని సంఘంలో సమత పెంచి పోషించాలని" ఆయన అభిమతం.

"పేదల స్వప్నాలు నిజమయ్యేట్లు, దేశాన్ని తీర్చిదిద్దాలని"

"చీకటిబజార్లు నడి చిల్లర దేవుళ్ళ ఆట కట్టించాలని"

"ప్రజలను మాయచేసి పబ్బంగగడుపుకొనే వినాయకుల భరతం పట్టాలని" "ఒంటరి వనితలను హింసించే తుంటరిగాళ్ళకు బుద్ధి చెప్పాలని" ఆయన నిర్దేశించుకొన్న లక్ష్యాలు. దేశశ్రేయస్సే కావ్యలక్షణం.

పరస్పర సంఘర్షణ లేని దేశాభిమానమూ, రాష్ట్రాభిమానమూ శ్రీనారాయణ

రావుగారి రచనలలో కనిపిస్తుంది. తెలుగు భాషపట్ల ఆయనకు అమితమైన అభిమానం ఉంది. "జుంటితేనె కన్న, జున్నుకన్న, పనసతొనలకన్న, పంచదారకన్న" మన భాష మధురమైనదంటారాయన. మహిళలపట్ల ఆయనకు అపారమైన గౌరవం వుంది. "భగవంతుని తర్వాత మనం ఋణపడేది ఒక్క స్త్రీకే" అంటూ స్త్రీకి దైవం స్థానాన్ని ఇచ్చారు. మగవాడి జీవితంలో అర్ధాంగి పాత్రకు అంతటి ప్రాముఖ్యం ఉన్నదని ఒకే ఒక పంక్తిలో ఎలా వివరించారో చూడండి. "పెళ్ళాడిన రోజే అభివృద్ధో, పతనమో ఆరంభమవుతుంది" తల్లి ఓరిమిని, కూరిమిని ఇలా శ్లాఘించారు.

"చేస్తున్నా పోట్లాడేది కుమారుడు - పోట్లాడుతున్నా చేసేది తల్లి
పెట్టినా విమర్శించేవాడుబిడ్డ, విమర్శించినా పెట్టేది తల్లి" అన్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో టెలికమ్యూనికేషన్ల వ్యవస్థకు మహాధిపతిగా పనిచేసిన శ్రీ, ఎమ్. ఆర్. సుబ్రహ్మణ్యంగారికి డిపార్టుమెంటులోన వెలుపలా కూడా చాలా మంచిపేరు ఉంది కాని, అదంతా ఒక ఎత్తు శ్రీ నారాయణరావుగారు ఆయన పట్ల చూపించిన అభిమానం ఒక ఎత్తు. మూడు కవితలలో రచయిత శ్రీసుబ్రహ్మణ్యం గారిని ప్రశంసించారు, శ్రీ సుబ్రహ్మణ్యంగారు తనశాఖ అధిపతికావడంవల్ల చేసిన ప్రశంస ఎంతమాత్రం కాదది. ఉద్యోగులలో సామర్థ్యాన్ని, కష్టపడి పనిచేసేతత్వాన్ని గుర్తించడం, కులాలకు అతీతంగా వ్యవహరించడం, ఎలాంటి ప్రలోభాలకు లొంగకుండా నీతిగా, నిజాయితీగా, నిస్వార్థంగా విధి నిర్వహణచేయడం శ్రీసుబ్రహ్మణ్యంగారి పట్ల శ్రీ నారాయణరావు గారికి గాఢమైన అభిమానాన్ని, ఒక విధంగా భక్తిభావాన్ని కలిగించాయి. నిజమే ఇన్ని సద్గుణాలున్న ఉన్నతాధికారుల సంఖ్య, తగ్గిపోతున్నది. అలాంటి వారొకరైనా ఎక్కడైనా ఉంటే వారిని గురించి నాలుగు మంచి మాటలు చెప్పవలసిందే.

అలంకారాలు, ఆడంబరాలు కోసం ఆరాట పడకుండా శ్రీ నారాయణరావు చెప్పదలచుకొన్నది సూటిగా చెప్పడం "అక్షరమాల" లో కనిపిస్తుంది. ఈ వచన కవితలలో ఎన్నోజీవిత సత్యాలు ఉన్నాయి. వాటిని సూటిగా చెప్పడానికే ఆయన ప్రయత్నించారుగాని పదగాంభీర్యంకోసంగాని, లయకోసంగాని ఆయన ప్రయత్నించినట్లు కనిపించదు. కవితలన్నింటా ఒక ముగ్ధత్వం, పఠితలను ఆకర్షిస్తుంది. ఒక విధంగా ఇది ముగ్ధ కవిత శ్రీ నారాయణరావుగారు మరిన్ని రచనలు చేయాలని అవి జనరంజకం కావాలని నా ఆకాంక్ష.

పొత్తూరి వెంకటేశ్వరరావు

# మధురభావాస్పద వైవిధ్యరసబాల అక్షరమాల

కోమర్తి నారాయణరావుగారు దారితప్పిన ఇంజినీరు. దారి తప్పిన కవికూడా.

ఇక్కడ విచిత్రమల్లా, ఆయన ఏదారితప్పి, ఏదారిలో కొచ్చారన్నది.

ఇంతటి భావ కవితాశక్తి వున్న నారాయణరావుగారు దారితప్పి ఇంజి-నీరయ్యారా, లేక మంచి ఇంజినీరయ్యి, దారితప్పి కవిగా మారారా అన్నది.

రెండింటిలోనూ పేరుతెచ్చుకున్న, తెచ్చుకుంటున్న వ్యక్తిగా తన అక్ష-రమాలలోనే దర్శనమిస్తారు.

తను కూర్చిన ఈ అక్షరమాలని సంఘం మెడలో వేశారు. సంఘం, అన్ని కోణాలనుంచి కనపడుతుంది మంచి చెడుల కలయికతో -

అందుకే ఈ మాల మధురభావాస్పదవైవిధ్య అక్షరమాల.

'భావకవిత్వం' అన్నప్పుడు ముందు వినబడే మాట - 'భావం' ఆభావం బాగా వుంటే, 'యత్భావం తత్ భవతి' లాగా, కవిత మరింత అందంగా కనపడుతుంది.

చెప్పవలసినవిషయం సుస్పష్టంగా వున్నప్పుడే కవితా రూపం అందంగా వుంటుంది.

నారాయణరావు గారు సాధించింది ఇదే. ప్రతి విషయాన్ని కూలంక-షంగా పరిశోధించి రాసిన రాత ప్రభావం ఈ కవితల్లో ద్యోతకమవుతుంది. బహుశ, ఆయన సందర్భాలని పురస్కరించుకుని, మంచిభావన కలిగినప్పుడల్లా అక్షరాలను అన్వయించి పూసలుగా మార్చి ఈ పుస్తకమాలగా అక్షరమాలని అందిస్తున్నారు.

ఉపాధ్యాయుడి వృత్తికి ఎన్నికోణాలో, 'అమ్మ' లాలనలో బిడ్డకు రాజ-భోగం, ఎట్లా కలుగుతుందో ఆ 'అమ్మ' ఎంత గొప్పదో, ఒక 'కవి సృష్టికర్త' గా సాధించిగలిగేదేమిటో - బహువిపులంగా చెప్పకొచ్చారు. కొంత ఏబ్స్ట్రాక్షన్, ఎక్స్ప్రెషనిజం అన్నది కూడా కనపడుతుంది. 'మాట' అన్న కవితలో ప్రతిబింబించినట్లు, -

ఇద్దరువ్యక్తుల నిశ్శబ్దాన్ని చీల్చి మాటయొక్క శక్తిని ప్రతిపాదిస్తూ మరోప్రక్క ఆ మాటలని అక్షరమాలగా ఏర్చి కూర్చడంలోనే వుంది.ఆ మాట, యొక్క శక్తి ప్రదర్శన.

నీతి సూత్రావళిగా కొన్ని కవితలు కనిపిస్తాయి. వాటిల్లో చెప్పకోత-

గవి - యువతకోసం రాసిన కవిత, సంసార యజ్ఞప్రభావం, ప్రేమకి - కామానికి వ్యత్యాసం 'మద్యపానం' మీద చేసిన రచన చక్కగా సాగాయి.

ఆబ్కారీ ఆదాయంతో తప్ప నడవ్వా ప్రభుత్వయంత్రాంగాలు అంటూనే చిత్తశుద్ధివుంటే సాధించలేనిది వుండదు అని సమాధానంచెప్పడం - ఈనాటి సమస్య సమాధనం కూడా

కొన్ని వ్యక్తిగతమైన కవితలూ వున్నాయి. ముఖ్యంగా నారాయణరావుగారు తనకు నచ్చిన వారి గురించి రాసినవి.

వాటిలో చెప్పుకో తగ్గవి - హైదరాబాదులో టెలీఫోన్లవస్త దుమ్ము దులిపి చక్కటి మార్గంలో పెట్టిన శ్రీ ఎమ్.ఆర్. సుబ్రహ్మణ్యంగారి గురించి, ఆయన అందరికీ తెలిసిన వ్యక్తి, అందరూ ప్రేమించే వ్యక్తి.

కొన్ని 'తుమ్మలా సిస్టర్స్' వంటి తెలియని వారిగురించి కూడా తెలియ చెప్పిన వైనం - అవడానికి అది ఆయన స్వంత అనుభవమైనా నారీమణులు ఎట్లా వుండాలో ప్రతిపాదిస్తుంది.

టెలిఫోన్ అధికారి కాబట్టి - టెలిఫోన్ మీదరాసిన కవిత ఒక పాఠం అట్లాగే ఇంజినీర్ల అమంతృప్తి కూడా యాజమాన్యాలెట్లావుండాలీ అన్నది కూడా ఒక చోట కవితారూపంలో మార్గ దర్శకంగా కనపడుతుంది.

కవి - సృష్టికర్తగా విశ్వశ్రేయస్సు కోరుకునే వ్యక్తిగా సంఘప్రయోజనానికి పనిచేసే శ్రామికుడుగా దర్శన మిస్తారు మరోకవితలో

అందాకా ఎందుకూ - ఇప్పుడు నారాయణరావు గారి లోని భావ 'కవి' చేసిన పనీ ఇదే. చదివితే మీకే అర్థమవుతుంది.

గుడిపూడి శ్రీహరి.

# కవిత స్వభావం

నాకేమో, వచనంతోనే తప్ప, కవిత్వంతో అట్టే పరిచయంలేదు. కానీ - పరిచయం పెట్టుకొనక తప్పని ఉద్యోగాలే, ఇప్పటి దాకా చేశాను. దిన, వార, పక్ష, మాస పత్రికల్లో; ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ పనిచేస్తూకూడా - కవిత్వంతో సంబంధంలేకుండా ఉండడం సాధ్యంకాదు. ఇహ - ఆకాశవాణి ఉద్యోగం సరేసరి! కవిత్వంతో, "ఎంతో కొంత సంబంధం" ఉండడం మాత్రమే సరిపోదు. ఆ ప్రక్రియతో దగ్గరి సంబంధం పెట్టుకోవాలి. అప్పుడప్పుడు మొలుచుకుపోవాలి. కొన్నిసార్లు ఆ వాహినిలో మునిగిపోవాలి. అర్హతానర్హతలను కూడా గుర్తు చేసుకోకుండా - ఉద్యోగంలో భాగంగానే ననుకోండి; ఈ పనులన్నీ నేను చేయవలసివచ్చింది!

ఇందువల్ల, నాకూ కొన్ని లాభాలు కనిపించాయి. కవిత్వమంటే ఏమిటో ఇప్పటికీ నాకు తెలీనిమాట నిజమేగానీ, కవిత్వం కానిదేదో, కొంచెం అస్పష్టంగానూ, ఇంకొంచెం అనిర్దుష్టంగానూ తెలిసినట్లనిపిస్తుంటుంది. ఈ "అనిపించడం" లోనూ, నేను పొరబడిన సందర్భాలు చాలా ఉన్నాయనుకోండి! "తెల్లని వెన్నెల" అనడం కన్నా "వెండి పుప్పొడిలాంటి వెన్నెల" అనడంలో, నాకేదో కొత్తదనం కనిపిస్తుంది. "ఆ చెట్టుకెందుకో కోపం వచ్చి ఉండాలి. ఆగ్రహారుణ పుష్పనేత్రాలతో, అందరి వేపూ చూస్తున్నది" అనడంలో కూడా, ఏదో కొత్తదనమేకనిపిస్తున్నది.

ఒకలయ, ఒక ప్రాస, ఒకనడక ఉన్నవి మాత్రమే కవితలని నేననుకోను. కవితకు- అవి- అదనపు అలంకారాలు కావచ్చుగానీ, "అవే కవితలు" అని- నేనిప్పటికీ అనుకోలేక పోతున్నాను.

ఒక వస్తువును దర్శించడంలో, అలా దర్శించడానికి నువ్వెన్నుకొన్నకోణంలో కొత్తదనం ఉండాలి. సాధారణ మయిన దాన్ని గురించే కావచ్చు; నువు చెబుతుంటే, నాకది అసాధారణ సౌందర్యంతో కనిపించాలి. అలా కనిపించినప్పుడే అందులో నాకేదో నూతనత్వం ఉన్నట్లనిపిస్తుంది. ఆనూతనత్వం పేరే కవిత కావచ్చు. అదిలేకుండా మిగిలిన గుణాలెన్ని ఉన్నా - అది - ఇంకేమన్నా అవుతుందేమోగానీ, కవిత్వం కాదనుకొంటున్నాను.

చెప్పవచ్చిందేమిటంటే -

శ్రీకోమర్తి నారాయణరావుగారి "అక్షరమాల" లో, అల్లాగా, గుండెను 'జిల్లు' మనిపించే పంక్తులు చాలా ఉన్నాయి.

"భార్యల్లో అక్కచెల్లెళ్ళలో - చెడ్డవారుంటారక్కడక్కడ; కానీ అమ్మల్లో మాత్రం - చెడ్డ అమ్మలుండరెక్కడా" అంటారు వారు.

అప్రతిమానమైన కవిత్వరచనకు, ఋషిహృదయం కావాలని నారాయణరావుగారు విశ్వసిస్తారు. నా విశ్వాసమూ అదే!

"కాంతాలయం"
విజయనగర్ కాలనీ
హైదరాబాదు - 500 457

రావూరి భరద్వాజ
19.10.92

# కృతజ్ఞతాంజలి

నా విజ్ఞాన వికాసానికి, ఎన్నోవిలువైన పుస్తకాలను సూచించడమేకాకుండా పుస్తక దుకాణములలో దొరకని పుస్తకాలను సైతం నాకు లభింపజేసి బహువిధాల తోడ్పడిన మల్లాం వాస్తవ్యులు, రాజకీయ వేత్త, న్యాయ వర్తనులు, అంతకుమించి మాబంధుకోటిలో ప్రముఖులు అయిన శ్రీకొవ్వన కొండలరావు(నాయన) గార్కి.

నా పుస్తకాన్ని స్వీకరించడానికి ప్రేమతో అంగీకరించి నన్ను కృతార్థుడ్ని చేసిన సాంకేతిక కళాప్రపూర్ణులు, దైవసమానులు, మా శ్రేయోభిలాషులు అయిన శ్రీఎమ్.ఆర్. సుబ్రహ్మణ్యంగార్కి **నా కృతజ్ఞతా సుమాంజలులు.**

నా పుస్తకానికి అడగ్గానే ప్రేమాభిమానాలతో తమ అమూల్య అభిప్రాయాలను అందించి ఆశీర్వదించడమే కాకుండా వారి పవిత్ర హస్తాలతో ఈ పుస్తకావిష్కరణగావించి వెలుగు లోనికి తెచ్చిన ప్రముఖ పత్రికా సంపాదకులు పరోపకారపరాయణులు. దైవభక్తి సంపన్నులు ప్రస్తుతం, తిరుమల తిరుపతి దేవస్థాన పండిత ప్రముఖులలో ఒకరుగా నియమింపబడి భక్తజన సముదాయానికి తమభక్తి రచనల ద్వారా ఆధ్యాత్మిక రసామృతాన్ని పంచిపెడుతున్న మిత్రులు శ్రీపొత్తూరి వెంకటేశ్వరావుగార్కి.

జర్నలిజంలో ప్రముఖ స్థానాన్నలంకరించి ఎన్నో విమర్శనాత్మక వ్యాసాలను, విజ్ఞాన దాయక అంశాలను వ్రాస్తూ, సమాజంలోను, రాజకీయాలలోను పేరుకుపోతున్న కల్మషాన్ని తమ అద్భుత విమర్శనాప్రవాహంతో ప్రక్షాళనం గావిస్తున్న విజ్ఞులు సంఘసంస్కరణాభిలాషులూ అయిన శ్రీ గుడిపూడి శ్రీహరిగార్కి.

నడుస్తున్న చరిత్రను, మారుతున్న జగత్తును దృష్టిలో వుంచుకొని చక్కని రచయితగా, కాదంబరి, పాకుడురాళ్ళు, జీవనసమరం లాంటి ఎన్నో ఆణిముత్యాల్ని సమాజానికందించి, ఆంధ్రప్రదేశ్ తెలుగు సాహిత్య అకాడమీ వారితో కళాప్రపూర్ణ వంటి అత్యుత్తమ పురస్కారాలందుకున్న సహృదయులు, సాహితీవేత్త, సదసద్వివేకి అయిన డా|| రావూరి భరద్వాజగార్కి **నా హృదయపూర్వక సుమాంజలులు.** నాయీ అక్షరమాలను ఎమ్.వి.రమణ (ఎస్.డి.ఓ.పి సనత్‌నగర్) గార్కి డి.డి. కృపావరం (ఎస్.డి.ఓ.పి.గోల్కొండ) గార్కి, ఈ అక్షరమాలకుమేలు ప్రతిని వ్రాసి యిచ్చి తోడ్పడిన శ్రీ బి.ఎల్.ఎన్.ప్రసాద్ (హెడ్‌డ్రాఫ్ట్‌మేన్) గార్కి,

ఈ కవితా సంపుటిని పుస్తక రూపంలో ప్రేమతో ప్రోత్సహించిన. స్నేహితులు టి. సాంబశివరావు [(A.E(EST)] గార్కి, స్నేహితులు శ్రీ తిరుమల శ్రీనివాసులు (హైడ్ డ్రాఫ్ట్‌మేన్) గార్కి **నా కృతజ్ఞతాపారిజాతాలు.** ఈ 'అక్షరమాల' పుస్తకావిష్కరణ, "ఫేమిలీ వరల్డ్" ఆవరణను ఏర్పాటు చేసిన మిత్రులు శ్రీ డి.వి.రాజశేఖర్ గార్కి **నాప్రేమమరందమాధురి.** నా 'అక్షరమాల'కు ఆలశ్యం చేయకుండా అచ్చువేసిన శ్రీతిరుమలాప్రింటర్స్ అధినేత, శ్రీ బి.వి.కృష్ణకుమార్ గార్కి **నా సహృదయాంజలి.**

నాతెలుగు సాహిత్య పఠనంలోను, ఈకవితా సంపుటిని వ్రాసుకోనే వేళలలోను, సాహిత్య పరిచయంలేక పోయినా, నాకు అనుకూల, శాంతి యుత గృహవాతావరణాన్ని కల్పించి సహకరించిన నా ఉత్తమార్థం (Better Half) అదేనండి నాశ్రీమతి చి|| సౌ|| సత్యవతికి నా ఆశీస్సులు.

కోమర్తి నారాయణరావు.

# నివేదన

ఈ పుస్తకరూపంలో పొందుపరచిన కవితా సంపుటిని, అప్పుడప్పుడు నాలో ఆవేదన, ఆవేశం, సానుభూతి కలిగినపుడు, వ్రాసి భద్ర పరచుకొన్నవి. ఇవి ఏ ఒక్క మాసంలోనో, సంవత్సరంలోనో వ్రాయ బడినవికావు. షుమారు అర్ధ దశాబ్ద కాలంనుంచి, నాలో స్పందనకలిగి నప్పుడల్లా అవి అక్షర రూపం దాల్చుతూ వచ్చాయి.

సమాజంలో జరుగుతున్న పోకడలను, అవాంచనీయ సంఘటనలను, సామాన్య జనం చూసినప్పుడు వారి మనస్సు గాయపడినా, నిస్సహాయ స్థితిలో చూస్తూ వాటిని ఎదుర్కొనే శక్తి లేక, ఆ అరాచకానికి బలైన వ్యక్తుల పట్ల సానుభూతితో రెండు కన్నీటి చుక్కల్ని రాల్చి ఊరట చెందడం జరుగుతుంటుంది. ఆ విధంగానే సమాజ పరంగా, జాతి పరంగా, స్త్రీల పరంగా జరుగుతున్న కొన్ని సంఘటనలను తిలకించినపుడు వాటికి అడ్డు తగిలి ఎదిరించలేని స్థితిలో నాలో పొంగిన ఆవేదనను కన్నీటి చుక్కలుగా కాకుండా నాకొచ్చిన కొన్ని అక్షరాలను కాగితంపై రాల్చి నాలో పొంగిన, ఆవేదనను చల్లార్చు కుంటున్నాను. అవే ఈనాడు వచన, కవితల రూపంలో మీ ముందు క్వొచ్చి మీ చేతుల్లో వాలాయి.

అలానే నాకునచ్చిన, నేను మెచ్చిన మంచి వ్యక్తుల గురించి, వారి గొప్ప తనాల్ని గురించి పదే పదే ఆలోచించినపుడు నాలో పెల్లు బికిన అపార గౌర వాభిమానాలను వెల్లడించుకోడానికి యీ తెల్ల కాగితాలను ఉపయోగించుకొని వాటి మీద ఆ పొంగులను ఒలక బోసుకుంటున్నాను.

నిజం చెప్పాలంటే నేను కవినీగాను, నాకు కవిత్వమూ రాదు. పైన మనవిచేసుకొన్నట్లు, అప్పుడప్పుడూ నాలోకలిగిన భావా వేశాలను కాగితాలపై అక్షరరూపంలో అందంగా పేర్చాలనే తహతహ మాత్రం ఉండేది. అవే యీనాటికి, ఒక చిన్న పుస్తక రూపంగా రూపుదిద్దుకో బడ్డాయి.

ఇక్కడ ఒక మాట చెప్పాలి. నాలో కలిగిన అంతర్మధనాలను, ఆవేశాలను, ఆ వేదనలను ఈ పుస్తక రూపంలో వెలువడడానికి ప్రేరణ నిచ్చిన ఆపద్బాంధవులు, పూజ్యులు శ్రీ ఎమ్. ఆర్. సుబ్రహ్మణ్యం గారు. ఆయన ఆంధ్రప్రదేశ్ టెలికాం సర్కిల్ ఛీఫ్ జనరల్ మేనేజరుగా పదవి నలంకరించి యున్నారు. నాలో కలిగిన భావాలు అక్షర రూపం దాల్చడానికి

ఆ మహానుభావు లొసగిన ఆశీర్వాదంతో కూడిన ధైర్యస్థైర్యాలు నాకు ఎనలేని స్ఫూర్తిని, దీప్తిని ప్రసాదించాయి.

అప్పుడప్పుడు నేను రాజకీయ సిద్ధాంతాలకు స్పందించిన మాట వాస్తవమే అయినా, ఎప్పుడూ, ఏ రాజకీయ పార్టీ పట్ల మొగ్గు చూపలేదు. దేనికీ దాసోహం కాలేదు. వ్యక్తిగతంగా నాకొక పంథా వుంది. అది ఎంత జటిలమైనదైనా భరిస్తానుగానీ నాకు నచ్చని విషయాలకు రాజీపడను. అందువల్ల అప్పుడప్పుడూ నాలో నేనే ఎదురు ప్రశ్న వేసుకుంటాను. ఈ నిశ్చిచ్చితనం నా కవితల్లో కూడ కన్పించ వచ్చు. కొన్ని కవితల్లో వైరుధ్యం వినిపించవచ్చు. నాకు విమర్శలన్నా, ఉపన్యాసాలన్నా చాలమక్కువ. అందుకే నాకవితలు పొడవుగా వుండి, చదువరులకు కొంత విసుగు కలిగించవచ్చు.

కవితలు అందంగా, కమ్మగా కృష్ణశాస్త్రిగారి కవనంలా వుండాలని తాపత్రయ పడుతూ, వ్రాసిన పదాన్ని ఎన్నోసార్లు తిప్పితిప్పి చదువుకోవడం, సరిగ్గా కుదరలేదని చింపివేయడం, తిరిగి వ్రాయడం, యిలా అనేక పర్యాయాలు ప్రయత్నించడం చేసి, చివరకు యీ ఆకారాన్ని చిత్రించడం జరిగింది. కానీ నాకు "అక్షర శుద్ధి" యింకా సిద్ధించలేదనే అనుకుంటున్నాను. అయినా నేను అనునిత్యం స్మరించుకొనే అధినాయకులైన శ్రీ ఎమ్. ఆర్. సుబ్రహ్మణ్యం గారికి నామనసులో ఆరాధనా భావాన్ని నివేదించు కోవాలనే తపనతో ఈ విధమైన సాహస ప్రయత్నం చేశాను.

భాష అనేది నిరంతరం ప్రవహించే జీవనదిలాంటిది. ఆ జీవనదికి విసుగూ విరామం వుండవు. అది నిత్య నూతన చైతన్య స్రవంతి. ఎందరు ఎన్నికవితలు వ్రాసినా, ఆ భాషకు అరుగూ, తరుగూ ఉండవు. అది దేశ, కాలమాన పరిస్థితులకు లోనై మారుతూ వుంటుంది.

ఈ నా కావ్యంలో నాకు తెలియని వ్యాకరణ దోషాలు కొన్ని దొర్ల వచ్చు. పాఠకులు సహృదయంతో మన్నించి ఆ శీర్వదిస్తారని ఆశిస్తున్నాను. నా అభిప్రాయాలన్నిటినీ మీరు అంగీకరించాలనే నియమం లేదు. అటువంటి దురాశ అంతకన్నా లేదు.

ఏడేళ్ళ తపః ఫలితమయిన నా కవితా సుమమాలను మీ చేతులలో పెడుతున్నాను. దీన్ని ఆదరిస్తారో లేక పనికి రాదని నలిపిపారేస్తారో మీ యిష్టం.

ఇట్లు.
కోమర్తి నారాయణరావు.

# అంకితం

రాజుల కాలంలో అయితే కవులు తాము రచించిన కావ్యాలను రాజులకు అంకిత మిచ్చేవారు. అందులో ఆయా రాజుల వంశాలను, విజయాలను వర్ణించేవారు. అది ఒక మాదిరిగా ఆయా రాజుల సమకాలీన చరిత్ర వ్రాయడం లాంటిది, రాజుల చరిత్ర, రాజ్యాల చరిత్ర. అందుకు బదులుగా ఆయా రాజులు పెద్ద మొత్తాలలో ధన, కనక, వస్తు, వాహనాలను ఇవ్వడం ద్వారానూ, మాన్యాలనూ, అగ్రహారాలనూ బహూకరించడం లాంటివి చేసేవారు.

కానీ నేను మహారాజశ్రీ శ్రీ మన్నేపల్లి రామ సుబ్రహ్మణ్యం గార్కి నా కావ్యాన్ని అంకితమివ్వడం ద్వారా నేను ఎటువంటి స్వార్థాన్ని ఆశించి మాత్రం కాదని మనవి చేసుకొంటున్నాను. ఇంతవరకూ వారునాపట్ల కనపరచిన ప్రేమ, వాత్సల్యాలను నేను మాటల్లో చెప్పాలంటే నాకొచ్చిన భాష సరిపోదు. వ్యక్తిగతంగానూ, ఉద్యోగరీత్యానూ వారు నాకు చేసిన మహోపకారాలను ఆ జన్మాంతం మరువరానివి. అలావారి కృపకు పాత్రుడ నైనందుకు నాలో నేను పొంగి పోతూ, అది నా అదృష్టమని భావించుటయే గాక, అదొక పూర్వ జన్మసుకృత ఫలితమేనని అనుకొంటున్నాను. నిజానికది వారి ఔదార్యానికీ, పెద్దమనసుకీ తార్కాణమేగాని, నాలో వారి కృపాక టాక్షాలను పొందే అర్హతగాని, తాహతుగాని, లేవని చెప్పడానికి వెనుకాడను. వారివలన పొందిన ఉపకారాలకు నేనెంతగానో ఋణపడివున్నాను. ఆ ఋణభారాన్ని యేవిధంగానూ తీర్చుకోలేని అల్పుడను, అసమర్థుడను గాబట్టి ఈ చిన్న పుస్తకాన్నైనా వారికి బహూకరించి నట్లయితే చంద్రునికో నూలుపోగు సమర్పించినట్లు కాగలదని నా విశ్వాసం.

శ్రీ ఎమ్.ఆర్ సుబ్రహ్మణ్యంC.G.M.T. గారి పట్ల, నాకు అపారమైన ఆరాధనా భావం వుండుటకు పైన పేర్కొన్న కారణ మే కాకుండా అంతకు మించిన ప్రబల కారణాలున్నాయి. అసలు ఒక వ్యక్తికి మరో వ్యక్తి పట్ల ఆకర్షణ, భక్తి, ఆరాధనా భావం ఎందుకు కలుగుతాయంటే, ఆ వ్యక్తిలో గల ఉదార స్వభావం, కళంకంలేని-నిస్వార్థ వర్తనం, అదరూ బెదురూ లేని ధీరో దాత్తగుణం. తిరులేనిదైనమిజం పరోపకార చింత మొదలైన మహోన్నతగుణాలు కలిగి వుండుట వలనేనని అంద రకూ తెలుసు. అటువంటి సద్గుణాలన్నీ మూట గట్టు కొని శ్రీరామ

సుబ్రహ్మణ్యం గారిలో కాపురం చేస్తున్నాయి గనుకనే నేను వారిపట్ల ఆకర్షితుడనై ఆరాధించడం ప్రారంభించాను. వారిలో పాదుకొని వున్న సద్గుణాల దొంతరకు, నేనేకాదు నాలాగ అభిమానించి ఆరాధించే వారు యింకను ఎందరో ఈ హైదరాబాదు టెలికమ్యూనికేషన్ విభాగంలో వున్నారు. వారిని తలచుకున్నప్పుడు నామనస్సుకు వారి

"ఒడిదుడుకులు లేని - జీవితం
గడబిడలు లేని - ప్రసంగం
చిడిముడులు లేని - నుదురు
గడులు లేని - హృదయం
అంచులు లేని - ఆప్యాయత" గోచరిస్తాయి. ఇవన్నీ వారికి పెట్టని ఆభరణాలుగా భాసిస్తాయి.

అలానే

"వారి పలకరింపులో - ఆ ప్యాయత గిలకరిస్తుంది,
వారిమాటల్లో మార్దవం-చిలకరిస్తుంది,
వారి ఔదార్యం, ఎదలను-రంగరిస్తుంది."

ఈ అఖిలాంధ్రదేశంలోని, టెలిఫోన్ వినియోగదారుల హృదయాలలో, తమ అమూల్య సేవలతో కోటి దివ్వెలు వెలిగించి, దూరసంచార సిబ్బంది మనసులలో, తమ పరిపాలనా పటిమతో పసిడిపంటలను పండించి, ఘటనాఘటన సమర్థులుగా ఆధునిక, సాంకేతికాభివృద్ధి రంగంలో, గౌరీశంకర శిఖరాన్నధిరోహించి వెన్నెల వాడలు, కర్పూర వసంతాలు, నాగార్జునసాగ రాలు సృష్టించి, సాంకేతిక విప్లవ విశ్వనాథులై, ప్రగతి ఋతుచక్రధారియై, రాగరహో విశ్వంభరకు తమ రస హృదయాల్ని భూమిక చేసి, కీర్తి ప్రతిష్ఠల నార్జించి, మహాధినేతగా భాసిస్తూ చలువ చందురుని వలె ప్రకాశిస్తున్న ఆంధ్ర సర్కిల్ చీఫ్ జనరల్ మేనేజరు గారైన శ్రీ శ్రీ శ్రీ మన్నేపల్లి రామ సుబ్రహ్మణ్యం గారికి- ఈ చిన్న పొత్తాన్ని కానుకగా అర్పించుకుంటున్నాను. ఆనందిస్తున్నాను.

యిట్లు
కోమర్తి నారాయణరావు.

# శ్రీ ఎమ్. ఆర్. సుబ్రహ్మణ్యం గారికి
# అంకితం

సాంకేతిక కళా ప్రపూర్ణులై
గౌరీశంకర శిఖరాన్నందుకొన్న వారు,

ఆంధ్రప్రదేశాన్ని ప్రగతి పథంలో నడిపించడానికి,
అహోరాత్రాలు, సూర్యచంద్రులైనవారు,

తెలుగుతోటలో, సాంకేతిక వసంతంలో
పలు రకాల ప్రగతి ప్రసూనాలను పూయించినవారు.

ప్రగతి కుంటుపడి, పలు ముఖాలుగా పలచబడుతున్న
వినియోగదారుల ప్రశంశా సంతృప్తులను,
కాయకల్పచికిత్సచేసి ద్విగుణీకృతం చేసినవారు,

దశ వసంతాలు కృషి చేసి ప్రగతి కుసుమాలు పూయించి
ఆ సువాసనలు ఢిల్లీనగర దూరసంచార భవన శిఖరాలకు వెదజల్లినవారు,

హస్తినాపుర సార్వభౌముల ప్రశంశలకు పాత్రులైనవారు
ఎన్నో పురస్కారముల్, బిరుదముల్ పొందిన మేటి ఘనాపాటి.

పాత బడి నాణ్యత లోపించిన ఎక్ఛేంజిలను
అత్యాధునిక ఎలక్ట్రానిక్ ఎక్ఛేంజిలుగా మార్పుచేయించినవారు

అన్ని తరగతుల వారికి తమ విశిష్ట వ్యక్తిత్వంతో
అమితంగా ఆకర్షించి వారి మన్ననలకు పాత్రులైనవారు.

సరసులు, సహృదయులు, రసాభిజ్ఞులు
కుల, మత, వర్గ విభేద రహితులు.

సమస్త జన ప్రేమాస్పదులు
కార్యదక్షులు, దీక్షా కంకణ బద్ధులు

ఆడి తప్పని వారు. వెనుకడుగు లేనివారు
దూరదర్శి, సూక్ష్మగ్రాహి,
చతురవక్త సజ్జీవన ప్రవక్త.

నాకు అత్యంత పూజ్యులు, కనిపించేదైవం
శ్రీ ఎమ్.ఆర్. సుబ్రహ్మణ్యంగారు.

అంతటి మహిమ గలవారికి, ఈ చిన్నకవితా సంపుటిని,
అంకితమిస్తున్నాను, ఆనందపడుతున్నాను.

హైదరాబాదు జిల్లా టెలీకమ్యూనికేషన్స్‌లో డివిజినల్ ఇంజనీర్‌గా ఉద్యోగం చేస్తున్నారు.

దేశంలో నున్న, నగరాలు, పట్టణాలు, మారుమూల పల్లెలు సైతం ఆధునిక సదుపాయాలతో ఎంతో ప్రగతిని సాధించు కొని ముందుకు పోతున్న యీ కాలంలో - దప్పిక తీర్చుకోడానికి మంచి నీరు, చీకటిని పారద్రోలడానికి విద్యుత్ కాంతి పంటలుపండిచడానికి నీటివసతి మొదలైన కనీస అవసరాలకు కూడా నోచుకోని విశాఖ పట్నం జిల్లా, పాయకరావు పేట నియోజకవర్గంలోని గుల్లిపాడు అనే గ్రామం వీరి జన్మస్థలం.

ది 1-10-1935వ తేదీన జేష్ఠానక్షత్రమందు కీ||శే|| కోమర్తి నర సింహమూర్తి, శ్రీమతి లక్ష్మమ్మ అనే దంపతులకు నాలుగోసంతానంగా జన్మించారు.

గుల్లిపాడు గ్రామంలోనే గల ఎలిమెంటరీ పాఠశాలలో ప్రాథమిక విద్యను, పూర్తి చేసుకొని, శ్రీ రాజా వారి హైస్కూల్, తునిలో స్కూల్ ఫైనలు వరకు, పి. ఆర్. గవర్నమెంటు కళాశాల, కాకినాడలో ఇంటర్ మీడియేట్ వరకు, పోస్టల్ డిపార్టు మెంటులో గుమస్తాగా ఉద్యోగం చేసుకొంటూ ప్రయివేటుగా బి. ఏ. ఎకనమిక్స్‌తో చదువుకున్నారు.

చిన్నప్పటినుండి తెలుగు కావ్యాలు, పురాణాలు, విమర్శలు, మొదలైనవి చదవడం చేస్తూ తెలుగు భాషపైన, సాహిత్యం పైన అభిలాషనేర్పరచు కొన్నారు.

తెలుగులో నవలలు వ్రాయాలని, కవితలు అల్లాలని ఎంతో అభిలాష వున్నా, ఉద్యోగ రీత్యా ఎక్కువ సమయం చిక్కకపోవుట వలన అను కున్న ప్రకారం చేయలేక ఆ కోరిక తీరని కోరిక గానే యింత కాలం మిగిలిపోయింది. అయిననూ వీలుకుదిరినపుడల్లా సందర్భాన్ని బట్టి కొన్ని కవితలను గత ఏడేళ్ళుగా వ్రాసుకొంటూ వాటిని భద్రపరచి నేటికి ఈ "అక్షరమాల" అనే రూపంలో వచన కవితా సంపుటిని ప్రథమంగా ముద్రించి తమ వాంఛితాన్ని కొంతవరకు సఫలీకృతం చేసుకున్నారు.

తరువాత త్వరలోనే మరో కవితా సంపుటిని "అక్షర సుధ" అనే పేరుతో ప్రచురించాలని సన్నాహాలు చేస్తున్నారు.

రచయిత :- కోమర్తి నారాయణరావు.

# విషయ సూచిక

# కృతి భర్త



సాంకేతిక కళాప్రపూర్ణులు, కర్మయోగి
శ్రీ ఎమ్.ఆర్. సుబ్రహ్మణ్యంగారు C.G.M.T
ఆంధ్రప్రదేశ్ టెలికామ్ సర్కిల్

# కృతి కర్త



శ్రీ కోమర్తి నారాయణరావు D.E.P
సనత్‌నగర్, హైదరాబాదు.

# 1. ప్రార్థన

హే! పరమ శివా! పరంధామా!

నిలుచుంటిని నీ ఎదుటను నందివాహనా!
వేడుచుంటిని నీ కృపామృతమును పరమపావనా!

శరణుజొచ్చితి నీ చరణకమలముల చంద్రశేఖరా!
తొలగింపుము నా పాపకర్మలను పరాత్పరా!

అను నిత్యము నినుగొల్తును గౌరీశంకరా! .
ఇమ్ము సాధుజన సాంగత్యము సత్కారముజ్జేయ శుభంకరా!

చేతులను జోడించి సాష్టాంగ పడుదును సాంబశివా!
ఇమ్ము సాహసము సాయమ్ముజేయ తోటిప్రాణులకు పరమశివా!

ఎల్లవేళల జపియింతు నీ నామ మహిమను జగదీశ్వరా!
ప్రసాదించు దొడ్డగుణ మును దానధర్మముజ్జేయ మహేశ్వరా!

అనవరతము నీకు అర్చనలు జేయింతు ఆపదోద్ధారకా!
ఇమ్ము శక్తి యుక్తులు సత్కార్యముజ్జేయ భక్తవత్సలా!

పాములన్ ధరియించి పాపముల హరించు పన్నగ భూషణా!
ఒసగు మాత్మధైర్యమ్ము చెడుపనులనెదిరింప జంగమదేవరా!

మన్మధుని మర్ధించి మహర్షుల రక్షించు మార్తాండ తేజా!
ఒసగు మంచి మనసు పుణ్యకార్యము జ్జేయ పరాత్పరా!

గరళమును మ్రింగి లోకములగాచు గరళ కంఠా!
పోగొట్టు మజ్ఞాన మంధకారముల అశ్రిత మందారా!

కాళ్ళకున్ మ్రొక్కెదన్ కరుణించి కాపాడు కాశీవిశ్వేశ్వరా!
తొలగింపు మీర్ష్యాసూయలు, మోహమాత్సర్యాలు మాయామోహన రూపా!

భక్తితో వేడెదన్ భ్రాంతిని పొగొట్టు భూతనాథా! భక్తవరదా!
కలిగించు భక్తి భావముల సంకట వినాశా! సదాశివా!

నీవే దిక్కని నమ్మితి నారాయణ నుతా! నటరాజా!
ప్రసాదించు జన్మరాహిత్యం జగదేక వంద్యా! జయజగదీశహరా!

# 2. ఉపాధ్యాయుడు

విజ్ఞాన వికాసానికి - పునాదులు నిర్మించే విశ్వకర్మ ఉపాధ్యాయుడు!
తల్లిని, తండ్రిని మరపించి - మురిపించే ఇంద్రజాలికుడు.
ఆదరణ చూపించి- ఆదర్శంగా జీవింపజేసే ఆచార్యుడు
మమతల్ని చూపించి- మతసామరస్యాన్ని కలిగించు మతాచార్యుడు.

సమాజంలో హెచ్చుతగ్గుల తేడా- లేకుండా సృష్టించే అపరబ్రహ్మ
దేశానికి ధైర్యసాహసాలు గల- గొప్పవీరులను తయారుచేసే గంభీరమూర్తి

దేశభక్తుల కథల్ని వినిపించి- దేశనాయకులుగా రూపుదిద్దే సృష్టికర్త!
అక్షరాభ్యాసాన్ని చేయించి- అక్షరలక్ష్యాన్ని సాధించే కర్మయోగి!

తాను పెద్దగా వుంటూ-ఒక పెద్ద ధనవంతుణ్ణి చేసే విష్ణుమూర్తి!
తాను ఆదర్శంగా వుంటూ- ఒక ఆదర్శమూర్తిని తయారుచేసే వ్యక్తి!

రాతలు నేర్పి- పిల్లల రాతల్ని తీర్చి దిద్దే విధాత!
తల్లి తండ్రుడుల తరువాత- పూజింపదగిన పుణ్యమూర్తి!

ప్రాతః కాలాన్నే లేచి- పవిత్రంగా ఆరాధించదగిన పావనమూర్తి!
గురువు నేర్పని విద్య- శంఖంలో పోయని జలంలాంటిది.

గురువు యందు గల భక్తి - విద్యను వృద్ధి చేసే పరుస వేది
గురువు చెప్పిన మాట- వేదాలు కట్టిన మూట.

ఉపాధ్యాయుడు - విద్యార్థి ఔన్నత్యాన్ని కోరే అమృత మూర్తి
ఉపాధ్యాయుడు - శిష్యుడ్ని కుమారునిలా తీర్చి దిద్దే బృహస్పతి!

ఆదేవుని క్కూడా- గురువు వద్ద విద్యనేర్చుకొనుట ఆవశ్యకం
గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః
గురు సాక్షాత్ పరబ్రహ్మ తస్మై శ్రీ గురవేనమః.

# 3. కవిపోతన

మాగాణం లాంటి తెలంగాణంలో జన్మించావు నీవు
మై మరపించే భక్తి భాగవతాన్ని సృష్టించావు

నీ సృష్టిద్వారా ప్రజలకు ముక్తిని కల్పించావు
అతి సామాన్యులకు కూడా ఎనలేని శక్తినందించావు.

నీ భాగవతం తెలుగు వారి గుండెల్లో, దూకే జలపాతం
నీ కవితా శైలి తెలుగు నాల్కలపై, కరిగే నవనీతం

అది గుండెగుండెకు అందిస్తుంది అమృతం
నీవు చూపిన భక్తి భావం పామరునికూ్కడా ప్రసాదిస్తుంది జీవన్ముక్తి.

నీ రచన ద్వారా తెలుగు నేల పునీతమయ్యింది
నీ భావన ద్వారా తెలుగు ప్రజలకు భక్తిభావం ప్రాప్తమయ్యింది.

తెలుగులోకం నీకిదే అందిస్తుంది. ఎనలేని మంగళారతులు!
ఓ పోతనా మాత్యా! అందుకోవయ్యా మా తెలుగు నీరాజనాలు!

నీ కవితా కన్య నమ్ముకోక దారిద్ర్యాన్ని నుభవించ సంకల్పించావు
నీవు నమ్ముకున్న రామభద్రునికే ప్రాణాలర్పించావు.

నీ ప్రతి పద్యంలో ఉన్నది భక్తి మాధుర్యం
నీ హృదయంలో ఉన్నది తీరని భక్తిదాహం

నీ పద్యం రాని తెలుగు వాడుంటాడా!
కలడు కలండంటే అదినాకు సందేహమే మరి!

ప్రహ్లాదుని భక్తిలోను నీ మూర్తే కనిపిస్తుంది!
గజేంద్రుని ఆర్తిలోను నీ గొంతే వినిపిస్తుంది!

కావ్యంలో అంద చందాలను అలవోకగా గుప్పించావు
ఆ విధంగా అందరినీ ఎంతగానో మెప్పించావు

తేనె, పంచదార ఫల రసాలు ఎన్నున్నా నీకవితా మాధుర్య మరందాలే మిన్న!

# 4. మనదేశం - మహోన్నతం

హిమాలయాలు లేనిదే - పవిత్ర గంగానది పుడుతుందా?
ఋషి హృదయాలు లేనిదే - అప్రతిమాన కవిత ఉంటుందా?

మనదేశం అందాలొలికే - ఒక సువర్ణ మందిరం!
మహామహులు జన్మించిన - సుధా స్నిగ్ధ సుందరం!

మతాలన్నీ కలసి మెలసి - దివ్వెలుగా వెలిగినవిచట!
మానవాళి మనుగడ కోసం ప్రవక్తలు అందించారు వ్యవహార సరళి
ఇచట

వ్యక్తి కంటే సంఘం ముఖ్యమని తెలుసుకోండి.
సంఘం కంటే దేశం ముఖ్యమని గుర్తుంచుకోండి.

దేశం కన్నా ఖండం ఎంతో విశాలమని తెలుసుకొండి
భూగోళం కన్నా ఖగోళం బహు విశాలమని తెలియండి

అన్ని గోళాలకన్నా, అన్ని కొలతలకన్నా, పరిమాణాలకన్నా
మంచి మనిషి ఆలోచనలంతకన్నా విశాలమని మరువకండి

వేషం కన్నా, భాష ముఖ్యం,
భాష కన్నా, సేవ ముఖ్యం

కులం కంటే గుణం ముఖ్యం
గుణం కంటే మానవత మరీ ముఖ్యం.

# 5. మహాత్మునికి - స్మృత్యంజలి

ఈ రోజే జనవరి 30వ రోజు- యావత్ భారతం కన్నీరు మున్నీరుగా విలపించిన రోజు

ఈ ర్యాస్రూయలు, వెలుగును రాహువులా - కబళించిన చీకటి రోజు

వికసించిన పూలు మంటల్లో మాడి- మౌనవిషాదగీతం విన్పించిన రోజు

అఖండ భారతావనిని, ఏకాకిని చేసి- మన బాపు నిశ్శబ్దంగా నిష్క్రమించినరోజు

కోటాను కోట్ల జనవాహిని గుండెల్లో - దుఃఖాన్ని మిగిల్చి "మహాత్ముడు" మాయమైనరోజు

జాతి, కుల, మతాలనే సంకుచిత సరిహద్దుల్ని చెరిపేసి ఒక్కుమ్మడిగా పిక్కటిల్లిన రోజు

బానిస బంధనాలక్రింద మూల్గులు విడుస్తున్నజాతికి - జాగృతంచేసిన మహనీయుడు

బ్రిటిష్ సామ్రాజ్యాధినేతలపై సత్యాహింసల అస్త్రాలను సంధించి విడిచిన సవ్యసాచి!

దేశదేశాల, ఏదారి మలుపు తిరిగినా - 'జాతిపిత' చరణగాలి ప్రభంజనంలా చుట్టేస్తుంది.

సహేతుక సాహసాన్ని ఇనుపకవచంలా - ధరించి, విజృంభించిన వీర విరాట్టు మనగాంధీ

జలియన్ వాలాబాగ్‌లో తెల్ల దొరల కిరాతక చర్యలకు- నిలువెల్ల చలించి పోయిన కరుణామూర్తి!

రాట్నాల దారాలతో తంత్రులు మీటి - దండిలో ఉప్పు సత్యాగ్రహాన్ని చేయించిన సాహసమూర్తి!

ఓ బాపూ! అంటరాని వారని సమాజం వెలివేసిన అభాగ్యుల్ని -ఆదుకొని హరిజనులని అమృతమూర్తి ఆదరించిన! అమృతమూర్తి

నల్లవారిపై తెల్లదొరల ఘాతుకాల్ని నిలుపుటకై - ఆఫ్రికాకు వెళ్ళి అష్టకష్టాల పాలైన లోక కల్యాణమూర్తి!

ఓ జాతిపితా! నీగుండె పాడిన పాటలు, నీజాతి చరిత్రను-వేదనాదంగా ప్రతిధ్వనిస్తున్నాయి.

ఓ పురుషోత్తమా! నీ బాటలో స్వేచ్ఛా గీతం పాడుతూ-అమరవీరులెందరో ప్రాణాలర్పించారు.

జైళ్ళనిండా, స్వాతంత్ర్యోద్యమ ఉచ్ఛ్వాస నిశ్వాసాలు-కన్నీటి చారల మరకలు కనిపిస్తున్నాయి
అహింసతో, సింహాల్లా, అహంకార మదగజాల-కుంభస్థలాల్ని చీల్చిన ఆనవాళ్ళు అగుపిస్తున్నాయి.

మహాత్మా! నీ వందించిన నినాదాన్ని జనవేదంగా- జగత్కల్యాణ మంత్రంగా భావించి జపిస్తున్నాం
నీ ఉద్యమంలో ప్రాణ తర్పణం చేసిన అమరవీరుల త్యాగాలకు అభివందనం చేస్తున్నాం

నీ అడుగడుగూ నీప్రతిపలుకూ భారత జాతి ఉన్న - మూల మూలలా ప్రతిధ్వనిస్తున్నాయి,
నీ చిత్రం, నీచరితం, నీభాష్యం, మాకు వేదంగా - నాదంగా నినదిస్తూనే ఉన్నాయి.

నీ ధర్మచింతనా సౌధాగ్రం మీద, నీ చరిత్రను పాడుకుంటూ- నవభారత కేతనాన్ని ఆవిష్కరిస్తున్నాం!
నీ భావనాతరంగ భాష్యం, ధైర్యం గొలిపే నీ బోసి నవ్వు- మాకు స్ఫూర్తిని, దీప్తిని యిస్తున్నాయి.

ఓ మహనీయా! నీవు పూయించిన శాంతి పూలు- వాడిపోకుండా చూసుకొనే ధైర్యం మాకివ్వు
మానవతా జ్యోతులు వెలిగించిన పుణ్య హస్తాలనే నిర్దాక్షిణ్యంగా నరికి వేశారు "నరహంతకులు."

నిన్ను బలిగొన్న నాగరికతను తలచి- సిగ్గుతో తలవంచుకొంటున్నాం
భారత జాతి బ్రతికున్నంత కాలం- నీకు స్మృత్యంజలి ఘటిస్తూనే ఉంటుంది.

# 6. పంచ రత్నావళి

శ్రీ రామ సుబ్రహ్మణ్యం గారూ!

1 తమరాక తెలుగువారికొక ఆనంద పర్వం !
తమ కృషి ఆంధ్రదేశాని కొక ప్రగతి శిఖరం !
ఓ సాంకేతిక విద్యా ధురీణా! సకల సద్గుణాభిరామ !
తమ పేరే తెలుగు జాతికి సంతోషపర్వం !

2 మిమ్ముగని ఆంధ్రమాత పులకించింది,
మిమ్ము తాకి తెలుగునేల పరవశించింది,
ఆంధ్రావని వీధి వీధిన దూర్వాణులు వెలసి మురిసాయి,
చీకటి వాకిళ్ళలో క్రాంతి పూలు విరిశాయి.

3 తెలుగు నేల మొగ్గతొడిగె తమ సాధనలో,
తెలుగు చరిత పూలు పూచె తమ శోధనలో,
తెలుగు ఘనత పరిఢ విల్లె తమ పాలనలో,
కులమతాల కంపు పోయె తమ బోధనలో.

4 త్రేతా యుగమున ఋషులకు రాముడే దిక్కు,
ద్వాపరాన గోపికలకు కృష్ణుడే దిక్కు,
ఈనాడీ ఆంధ్రదేశ సాంకేతిక విస్తరణకు,
శ్రీరామ సుబ్రహ్మణ్యంగారే ఒక పెద్ద దిక్కు.

5 సలిల ముంటే తరగలకేం తక్కువ?
మబ్బులుంటే మెరుపులకేం తక్కువ?
శ్రీరామ సుబ్రహ్మణ్యంగారుంటే, ఆంధ్రదేశ
దూర సంచార విభాగానికి ప్రగతికేం తక్కువ?

# 7. "అమ్మ"

అమ్మ - అంటే దైవానికి ప్రతి రూపం.
అమ్మ - ఈ శరీరపు ఒక భాగం

అమ్మ - ఒక వెచ్చని స్పర్శ, ఒక చల్లని చూపు
అమ్మ - ఒక అంతు లేని అపేక్ష, విసుగెరగని నిరీక్షణ

అమ్మ - ఒక విసిగించే తాపత్రయం, అర్థం లేని చాదస్తం
అమ్మ - ఒక వెన్నాడే నీడ, సహనానికి మారుపేరు.

'అమ్మ' అన్నది - ఒక తీయని మాట!
అది ఎన్నెన్నో - మమతల మూట!

అమ్మ అంటే ఒక అంతు లేని దీవెన
అది ఒక - మరుపురాని భావన

అమ్మ అనేది - రెండక్షరాల మాట
కానీ అది - అక్షర లక్షల మూట

అమ్మ- ఒక పంతాల్లేని ప్రేమ
అది ఒక - అనంతమైన మమకారం!

అవతారమూర్తి అవతరించడానికి కావాలి ఓ అమ్మ !
అతడ్ని పెంచి పెద్ద చేయడానికీ - అవసరం ఓ అమ్మ!

ప్రేమకు ప్రతి బింబం అమ్మ!
సృష్టిలో అతి తీయనిది అమ్మ!

అమ్మ స్వార్థం - బిడ్డకు పూలపాన్పు
అమ్మవడి- బిడ్డకు ఓ పూల రథం!

అమ్మకు బిడ్డల్లో వ్యత్యాస ముండదు.
అమ్మకు ఎటువంటి బిడ్డైనా- ద్వేషముండదు

బిడ్డకు ప్రథమ గురువు అమ్మే!
బ్రతుక్కు పునాది వేసేది అమ్మే!

అమ్మ లాలన - బిడ్డకు రాజ భోగం!
అమ్మే లేక పోతే బిడ్డ బ్రతుకు అంధకారం!

ఆడవారిలో అమ్మకున్న స్థానం - అత్యున్నతం!
అమ్మకు సాటైనది- ఈభువిలో మరోటి శూన్యం!

భార్యల్లో, అక్కచెల్లెళ్ళలో - చెడ్డవారుంటా రక్కడక్కడ,
కాని, అమ్మల్లో మాత్రం- చెడ్డ అమ్మ లుండరెక్కడా!

# 8. కవి - ఓ సృష్టికర్త

కవి ఓ సృష్టికర్త! - మరోబ్రహ్మ వేత్త!
కవికి అందని ఎత్తు ల్లేవు - దిగని లోతుల్లేవు.

బీదతనంలేని జీవి - బీదతనాన్ని కోరివరించే జీవి
పేదరికంలో పెన్నిధిని తవ్విపొయ్యగల జీవి కవి ఒక్కడే

కవి తన కావ్యంలో అతిలోకసుందరిని - అంగాంగాలతో చూపించగల చిత్రకారుడు
పామరుని సహితం పండిత ప్రకాండునిగా - చిత్రించగల మాంత్రికుడు

కవిచేసిన సృష్టి- అనల్పమే గాక అనంతం
తన రస హృదయంతో- సమస్త జగాన్ని ఊవ్విళ్ళూరించగలడు

కవి తన కవనంతో- నిద్రాణమైన లోకాన్ని జాగృతం చేయగలడు
వీర విహారంతో చెలరేగుతున్న జనాన్ని- తన మృదుమధుర కవితలతో సమ్మోహనం చేయగలడు!

కవితన తీయని తలపులతో ప్రజలను - మధురమైన భావనలో ముంచెత్తగలడు
తన మధురభావన - పాఠక లోకానికి మరువలేని అమృతపు గుళిక

కవి తన కల్పనా శిల్పంతో - అతిలోక సుందరిని సృష్టించగలడు
తన భావనా పటిమతో - అద్భుత సృష్టి కల్పించ గలడు.

కవి కలానికి- కత్తిని మించిన పదునుంటుంది
కవికి శక్తిని మించిన యుక్తుంటుంది.

సృష్టికి ప్రతి సృష్టి చేయగల విశ్వామిత్రుడు కవి
తన అపూర్వ సృష్టితో - పాఠకులను అందలాలనెక్కించి ఊరేగించగలడు.

సాకారుని నిరాకారుని చేయగలడు
నిరాకారుని సాకారునిగ చూపించగలడు

కవి తన - పటిష్ట గ్రంధాలతో - సమాజంలోని దురాచారాన్ని రూపుమాపగలడు
కవి తన అద్భుత రచనలతో - ప్రజల్లో . జాతీయతను నెలకొల్పి, దేశాన్ని రక్షించగలడు.

కవి కలానికి లేదు దీటు - దానికి లేదు వేరొకటి పోటీ
కవికి సాటిలేరు ఎవరు - ఈ జగాన లేరు మరెవరు.

కవికి తెలిసిన పదాలు - తెలియ వచ్చు అందరికి
అవి అనుకున్నప్పుడు అందవు - అందరికీ అందంగా అతకవు.

కవిని ఒక యుగకర్త - అని పిలువ వచ్చు
ఆయుగంలో గల ధర్మాలను - ప్రజలకు ప్రభోధిస్తాడు.

కాలానికి తగిన ప్రగతిని ప్రభోధిస్తాడు
మానవ జాతికి- ఆ ప్రగతి పథంలో పయనింపజేసే మహనీయుడు.

ఏ నాటికానాడు - సంఘంలో ప్రతి బింబించే రూపాలను చిత్రిస్తాడు
ఏ సమస్యలకయినా - పరిష్కారమార్గాన్ని సూచిస్తాడు.

తన కవితలు ప్రతీకగా - నిలవటం కవి సాధించవలసిన విజయాలు
నవ్యతకు, భవ్యతకు - కాణాచి మంచి కవి

యుగాన్ని గౌరవిస్తాడు కవి - యుగ మాత ఆయన్నాశీర్వదిస్తుంది
కవి ప్రజలకు కృతజ్ఞుడై ఉండాలి

కవి ప్రజలలో ఒకరై మెలగాలి - ప్రజాశ్రేయస్సును నిత్యం కోరుకోవాలి
ప్రజల సమస్యలకు- పరిష్కారాలు చూపుతూ వుండాలి

విశ్వ శ్రేయస్సును కోరుకొనే వాడే కవి.

# 9. ఆడదిగా పుట్టడమే నేరమా?

ఈ దేశపు రాజకీయాలను - పదునేడు ఏళ్ళపాటు నడిపింది ఒక మహిళ
తనఅసాధారణ తెలివి తేటలతో - దేశాన్ని శాసించింది.

దేశం కోసం తన ఆఖరి రక్త బిందువును - చిందించింది,
ప్రమాదం పొంచి వుందని పసిగట్టినా - వెనుకంజవేయని ధీమతి

ఈ తెలుగు గడ్డపై పుట్టిన ఆడబిడ్డ -అఖండ మేధస్సుతో వెలుగొందుతుంది,
అత్యాధునిక కంప్యూటర్లనుసైతం అవలీలగా సవాలు చేస్తోంది.

దేశంలో ఓ మారుమూలగ్రామంలో పుట్టిన యువతి- ప్రపంచరికార్డులో కెక్కింది.
నిరంతర సాధనతో పాశ్చాత్యదేశాలనే ఆశ్చర్యపరచి "పరుగులరాణి" గా పేరుగాంచింది.

వ్యాపారాల్లోను, సైన్య విషయాల్లోను, అవిరళకృషి చేస్తూ కీర్తి గడిస్తున్నారు.
రాజకీయాల్లోను, క్రీడల్లోను - అత్యంత నైపుణ్యాన్ని ప్రదర్శిస్తున్నారు.

ఒకటేమిటి? ప్రతీరంగంలోను స్త్రీలు - మిక్కిలిగా రాణిస్తున్నారు.
తమదంటూ ఒక స్థానాన్ని సంపాదించుకొని - మగవాళ్ళను సైతం దిమ్మెరపోయేలా చేస్తున్నారు.

కాని యిదే దేశంలో, మనసొంత రాష్ట్రంలో - భద్రత లేకుండా భంగపడుతున్నారు.
చారిత్రక, భౌగోళిక, రాజకీయ ప్రాధాన్యతగల ఒక జిల్లాలో అనుక్షణం చిత్రవధను ^ఛవిస్తున్నారు.

అడవిలో పశువులకన్నా హీనంగా - బ్రతుకుతున్నారు అతివలు
ఆడదానిగా పుట్టినందుకు తమ్ముతాము శపించుకుంటున్నారు.

ఆడజన్మ మాకొద్దని దిక్కులు పిక్కటిల్లేలా - అరుస్తున్నారు.
దిగంతాల వరకు వ్యాపించే వీరి రోదన - వినిపించేదెవరికి?

నింగిలో ప్రతి ధ్వనించే వీరి ఆర్తనాదాలను - ఆలకించే వారెవరు?
నిరాటంకంగా కొన సాగే ఈ ఆటవిక వ్యవస్థ మారేదెప్పుడు?

సభ్యసమాజానికి తలవంపులుగా - పరిణమిస్తున్న పాశవికతకుఆటంకమెప్పుడు?
నాగరికతకు సవాలుగా కొనసాగుతున్న - దౌర్జన్యానికి అంతం ఎప్పుడు?

సమాజంలో ప్రతి ఒక్కరూ ఆలోచించాలి- పరిష్కారాన్ని వెతికి పట్టుకోవాలి!

# 10. యువత మేల్కొనాలి

తెలుగు జాతి కులాల వారీగా - విడిపోనున్నదా?
మనిషి మనిషికీ వున్న సమైక్యతను - సమాధిచేస్తున్నదా?

కులాలు లేని, మతాలు ఎన్నని - సమ సమాజం ఇక మనకు కరువేనా?
కులగజ్జిని రెచ్చగొట్టి- నరుక్కునే కాలం రానున్నదా?

ఆదారుణ స్థితికి తెలుగు జాతి - దిగజారి పోయిందా?
యువకుల్లారా రండి, యిటు వంటి దగుల్బాజీ ప్రయత్నాలను- ఎదిరించండి.

కులపురుగుల దుష్టపన్నాగాలను యువతరమైన మీరే అడ్డుకోవాలి
చీడ పురుగుల్ని పునాది వేళ్ళతో- పెకలించి వేయాలి

కులాల పరంగా ఏ కార్యక్రమం - జరుగకుండా ఎదిరించండి
సర్వమానవ సమానత్వానికై- మీరే నడుం బిగించండి

మనిషికీ మనిషికీ మధ్య వున్న అంతరాన్ని కూలదోయండి
అంతరాన్ని సృష్టించి శతృత్వాన్ని పెంచే- దురహంకారుల్ని దూరం చేయండి

మనిషికీ మనిషికీ వుండవలసింది- మానవత్వమని మరుకండి
కులాలమధ్య మతాల మధ్య వుండవలసింది- సాహోర్ద్రుత్వం, స్నేహభావమని తెలుసుకోండి.

# 11. యాజమాన్యానికి, హెచ్చరిక!

మీ వాళ్ళ మయిన మమ్మ్మ - వంచించకండి
ఒక్కసారి బాధ్యతతో - ఆలోచించండి

రోడ్డున పడ్డ మేము - ఎండా కొండా లెక్క చేయం
ఈ విప్లవం రానురాను - గతి తప్పుతోంది.

ఉత్తుత్తి వాగ్దానాలతో - ఓదార్చాలని చూడకండి
కల్ల బొల్లి కబుర్లతో- కాలయాపన చేయకండి

మండే గుండెలతో వున్న మమ్మ్మ- రెచ్చగొట్టకండి
మసి బట్టిన మీ మనసుల్ని -శుభ్ర పరచుకోండి

శాంతి కాముకులమైన మమ్మ్మ - రచ్చకీడ్చకండి
శుష్క వాగ్దానాలతో - మోసగించ యత్నించకండి

ఉద్యమం ఉధృతం కానీయకండి - శృతి మించి పాకాన పడనీకండి
ఒక్కసారి బాధ్యతతో నిర్మల మనస్సుతో - ఆలోచించండి

సమస్యలను సామరస్యంతో సానుకూల పర్చుకోండి
ఉద్యమాల్ని కడదాకా - కొనసాగనీకండి

కొంతకాలం మీరు - కొందరిని మోసగించవచ్చు
ఎల్లకాలం మీరు అందరినీ - మోసగించలేరు

మాకృషి మూలంగానే - మీ పరపతి పెరిగింది
మా శ్రమ కారణంగానే - మీ పదవులు పెరిగాయి

శ్రమించేది, మేమయితే - అనుభవించేది మరొకరు
సంపాదించే వాడున్నపుడే - లెక్కగట్టే వాడు అవసరం

లెక్కలు గట్టే వాడ్ని బట్టి- సంపాదన పెరగదని గమనించండి
కళ్ళు తెరిచి యదార్థాన్ని - తెలుసుకోండి

జీటూ, టీసా అని ఒకటొకటిగా - పోరాడకండి
ఒక్కటిగా చేరి ఒక్కొమ్మడిగా - విజృంభించండి

ఈ ఉద్రేక జలపాతాన్ని మోసమనే సీసాలో - బంధించలేరు
ఈ ఉద్యమ దావానలాన్ని - వాగ్దానాల ముసుగులో బంధించ లేరు

ఈ విప్లవంతో అలసిన శరీరాన్ని - మీ బలిసిన శరీరాలతో చూడకండి
ఈ అసంఖ్యాక జన సముదాయాన్ని - మీ కపటచేతులతో అడ్డుకోలేరు

ఒక తుఫానును విజృంభించకుండా మీ చేతులతో అడ్డుకోలేరు
ఒక మెరుపును మోసపు సంకెళ్ళతో - నిశ్చలంగా నిలపలేరు

గుండెలోతుల్లోంచి ఎగేసుకొని వచ్చే - ఆవేశాన్ని ఆపలేరు
గుండె వెనుక నున్న అశాంతి జ్వాలల్ని - శాంత వచనాలతో కప్పిపుచ్చలేరు.

డియర్ కామ్రేడ్స్-
ఊపిరినిండా అలజడులు చెలరేగాలి - మనసునిండా నెగడులామండే మంటలు ఎగసి పడాలి
చూపుల నిండా కొరకంచులు కాలాలి - చేతులనిండా అగ్నిజెండాలు ఎగరాలి

మీ కంచు కంఠాల్ని ప్రయోగించండి
ఒక్కుమ్మడిగా పిడికిళ్ళు - బిగించండి.

కావేరిలాంటి నదుల్లోంచి - కరెంటు పుట్టించుకోవచ్చు, వారు
కన్నీళ్ళ నదిలోంచి - క్రాంతి పుట్టించుకొంటాం మనం.

కలిసి కట్టుగా మనసత్తాను- చూపించండి
మనలో ఒక్కొక్కరూ ఒక్కొక్క విప్లవ వీరుడై- ఉద్యమాన్ని ఉధృతం చేయండి

యాజమాన్యం కురిపించే సవతి తల్లిప్రేమను - ఎండగట్టండి
విడదీసి పరి పాలించే నీచబుద్ధుల్ని - తుంగలో తొక్కండి.

# 12. ప్రగతికి తోడ్పడండి

ఖరీదైన కాలంనుంచి - అమృతం లాంటి ప్రగతి పుడుతుంది
అది కార్య శూరుని కంటి తోటలో - మందారం లా మెరుస్తుంది.

కావాలి కొత్త పంటకు - పాత విత్తనాలు
రావాలి కొత్త వారికి - తగిన అనుభవాలు

వే యొద్దు పెద్ద పీట - భజన పరులకు
చూడొద్దు చిన్న చూపు - నీతి పరులను.

హెచ్చు తగ్గుల తారతమ్యాలు వద్దు - ప్రగతి పథానికి అడ్డునిలవొద్దు
కులమతాల ప్రసక్తి తేవద్దు - అందరిలో ఆ పరమాత్ముడే కద్దు

అవతరించారు కొందరు - అ పరచిత్ర గుప్తులు
సృష్టిస్తున్నారు వారు - అడుగడుగునా అవరోధాలు

విలాసాలు పోతున్నారు - పల్లకీ దిగిన పెళ్ళి కొడుకుల్లా
విర్రవీగుతున్నారు - వలయానికి స్థిర బిందువుల్లా.

వారి కలం లేవాలంటే - బైట పారలూ, గడ్డ పాఱలూ కదలాలని
తెలుసుకోలేరు పాపం - వారు నూతిలోని కప్పలు

చూస్తారు సూర్యుణ్ణి - మసి పూసిన అద్దం నుంచి
భావిస్తారు భాస్కరుణ్ణి - కాంతి హీనుడని

తెలుసుగా చల్లని నీటి నుండే - మండే కరెంటు పుడుతుందని
వెనక్కిలాగిన అల్లెతాడు నుండే - బాణం విసురుగా దూసుకు పోతుందని

అందుకే సాగిపోవాలి - ప్రగతి పడవ అవిశ్రాంతంగా
అందుకోవాలి - ఆవలి ఒడ్డు అవలీలగా

ఈ దూర్వాణి మండలి విజయానికి - ప్రతి ఒక్కరూ దీక్షబూనుదాం
చలువ పందిరి నిర్మించి - వెన్నెల బావుటాలు ఎగరేద్దాం.

# 13. దురాశ

భోగాలనుభవించాలని వుంది - కాని కాలం తీరిపోయింది
శృంగారాభిలాష అధికమవుతుంది - కాని యవ్వనం నశించి పోయింది

అందంగా కనిపించాలనివుంది- కాని ముఖం ముడతలు పడిపోయింది
కన్నెపిల్లల మోజు తీరలేదు- కాని వంట్లో సత్తువ ఉడిగి పోయింది

చక్కని దృశ్యాన్ని చూసి ఆనందించాలనివుంది- కాని చూపు తగ్గిపోయింది
పరుగు పందెంలో పోటీ చేయాలని వుంది- కొని నడుస్తే కష్టంగా వుంది

రాజకీయనాయకుణ్ణి కావాలని వుంది- కాని ప్రజలకు నేనంటే పరిచయం లేదు
పారిశ్రామిక వేత్త నవ్వాలని వుంది - కాని గుండు సూది క్ర్కాడా ఠికాణా లేదు.

దానం చేసి పేరు పొందాలని వుంది - కాని డబ్బంతా వ్యసనాలకే ఖర్చయి పోయింది
తపో యోగం పొందాలని వుంది - కాని వయస్సు జీర్ణించి పోయింది

ఆహా! మనిషికి దురాశతో కూడిన - జీవితం, ఎంత మూఢమైంది.

# 14. అనాదిగా ఆడది

స్త్రీవి నీవు! ఈ దేశంలో పుట్టిన - అభాగ్యురాలివి!
అబలవంటూ - హద్దుల్లో వుంచారు నిన్ను!

రేయింబవలు నిన్ను- గానుగెద్దును చేశారు
నీ వొలపు సొంపులు - ముద్దు ముద్దుగ చూశారు

పూబోడివి! విరుబోణివి! అంటూ - ఇచ్చకాలు క్రుమ్మరించారు
హృదయేశ్వరి! జీవితేశ్వరి! అంటూ - మాయమాటలు వల్లించారు

తాగుబోతు మాటలు విని- తరుమబిడ్డ "సీతవు" నీవు!
వెలయాలిని కోరిన భర్తకు - ఎదురు తిరగని "సుమతివి" నీవు!

మొగుడోడిన జూదంలో నిండు కొలువున వలువ లొలచ బడ్డ 'ద్రౌపతివి' నీవు!
పతిదేవుని పరువు కోసం- నడివీధిన అమ్మబిడ్డ "చంద్రమతివి" నీవు

తండ్రి ఆజ్ఞ మీరని కొడుకు చేత- నరక బిడ్డ 'రేణుకవు' నీవు!
అణగారిన రాతి బ్రతుకు- కొనసాగించిన 'అహల్యవు' నీవు!

బలవంతుల కోర్కెలకు - బలిమైన కలికివి నీవు!
పతివ్రతవు నీవు! భగవంతునిచే భంగపరచ బడ్డ! 'బృందవు' నీవు!

భర్త రుచులు మెచ్చి 'అహర్నిశలు' - అతని బానిస వైనావు!
సహగమనం పేరున- భర్త శవంతో కాల్చబడ్డ అనాధవు నీవు!

ఆనాడు అమ్ముడు పోయినా - ఈ నాడు కొనుక్కున్నా తప్పలేదు దాస్యె రకం నీకు!
ఈ పవిత్ర భారత దేశంలో - జీవమున్న కీలుబొమ్మ వైనావు!
కానీ, నిజానికి శక్తి స్వరూపిణివి నీవు-

లే అమ్మా! లే ! బూజు పట్టిన సంఘం కుళ్ళును - కూకటివ్రేళ్ళతో పెకలించు
నయవంచకుల నీచత్వాన్ని - మహిషాసుర మర్దనిలా అంతమొందించు

రక్షక భటుల రాక్ష సత్వాన్ని - ఎదురునిలిచి తిరగబడు,
మునలి మనువు కుత్సితాలను - తాటాకుల తగుల బెట్టు,

నీవను గ్రహిస్తే - ఆనందం వెల్లి విరుస్తుంది
నీ వాగ్రహిస్తే - తుఫాను చెలరేగు తుంది

మగవాని మనుగడకు - దారి చూపే జీవన జ్యోతివి నీవు!
పసివాళ్ళ జీవితాల్ని - తీర్చిదిద్దే తొలిగురువువి నీవు!

భారత రాజ్యాన్నేలిన - ఇందిరాప్రియదర్శినివి నీవు!
రాకెట్లో గ్రహాంతర యానం చేసిన - స్వెత్లానావు నీవు!

కలం పట్టి రమ్య రామాయణాన్ని రచించిన - కవయిత్రి 'మొల్ల వు' నీవు!
కత్తి పట్టి కదన రంగంలో దూకిన - ఝాన్సీలక్ష్మీ బాయివి నీవు!

పాతివ్రత్యంతో త్రిమూర్తులను - పసిపాపలుగ మార్చిన 'అనసూయవు" నీవు!

పతిప్రాణాలకై యమునితో పోరాడిన - సతిసావిత్రివి నీవు!

**వేయి మాట లేల-**

సృష్టికి మూలాధారం నీవు - ప్రకృతికి ప్రతి రూపం నీవు!
దేవుని రూపంలో ఇంటింటా - వెలసిన తల్లివి నీవు!

నడుస్తున్న భూమికే - ఇరుసువు నీవు!
గడుస్తున్న కాలానికే - ప్రాణము నీవు!

నీవు లేనిదే రామాయణం లేదు- నిన్ను వదిలితే భారతం లేదు
నీవు లేని చోటు లేదు - నీ వుంటే లోటు లేదు.

మా దుర్వాణి మండలాభివృద్ధికి - రేయింబవలు పాటు బడుతున్న పడతివి నీవు!

# 15. చట్టం - ఉన్న వాడి చుట్టం

చట్టం ఉన్న వారికి చుట్టం లాంటిది - లేనివారికి ముళ్ళ చక్రం లాంటిది. కలిగినోళ్ళ అక్రమాలకు ఆధారం చట్టం. లేనివాళ్ళ అశక్తతకు సాక్ష్యం చట్టం.

శ్మశానాల్ని ఆక్రమించి అమ్మేసినా, కొంపల్ని కూల్చేసినా
లూటీలూ చేయించి - లాఠీలు ప్రయోగించినా

రక్షక భటులు స్త్రీలను రేప్ చేసినా - ఖైదీలను ఖతం చేసినా
'ఉలకదు ఈ చట్టం - పలకదు ఈ చట్టం

ప్రాజెక్టుల్లో కాంట్రాక్టర్లు - సిమెంటు బస్తాల్ని కేకుల్లా మింగేస్తున్నా
ఆఫీసుల్లో దొంగ బిల్లులు పెట్టి, ఆమ్యామ్యాలు మేసేస్తున్నా

గుడిసెల్ని పీకించి - మేడల్ని కట్టేసుకుంటున్నా
అదేమిటని అడిగిన వార్ని - అదే పనిగా చావ బాదినా

నిదుర బోతుంది చట్టం - కలిగినోళ్ళ కల్పతరువు ఈ చట్టం
నోరు మెదపదు ఈ చట్టం - అది బాగా ఉన్నోళ్ళకు మరీదగ్గర
చుట్టం!

న్యాయాన్ని సమాధిచేసి - అన్యాయానికి పట్టం గట్టినా
ఆదాయప్పన్నెగ్గొట్టి - అందలమెక్కి కులుకు తున్నా

రాజకీయ రాబందులు - దేశాన్ని దోచుకు తింటున్నా
నిజం చెప్పిన వాళ్ళని - నడి బజారులో ఖూనీ చేసినా

అధికార మదాంధుల - ఆగడాలు పెచ్చు మీరినా
అబల మాన మర్యాదలు - మంటల్లో మండి మసవుతున్నా

పట్టు పరువుల మీద - పొర్లాడుతున్న ఈ చట్టం !
ప్రజాస్వామ్యాలలో - ప్రగతి దారులకు చీకటి ఘట్టం!

న్యాయ స్థానాల్లో సాక్ష్యాలు పుట్టించి - లేని వాడ్ని ఈ చట్టం ఉరితీయిస్తుంది
పుష్కలంగా డబ్బు వున్నవారిచేతిలో - ఈ చట్టం ఉరితీయబడుతుంది.

# 16. కులవ్యవస్థ

ఈ కులమనేది- ఒక దుర్మార్గపు దుష్ట సాంప్రదాయం
ఈ దౌర్భాగ్యపు వ్యవస్థ- మనదేశాన్ని పట్టిపీడిస్తున్న అంటురోగం.

ఏలినవారు ఏకరువు పెడుతున్నారు- ఒకవంక - ఈ కులాన్ని రూపుమాపుతామని
కానీ, అదేపనిగా అడుగుతున్నారు మరోవంక - మీ కులమేమిటని?

జంతువుల్లో వుండవు ఈ కులాల జంఝాటాలు
జంతువులకంటె ఉన్నతమైన ఈ మనుషులక్కావాలి- కులాల తారతమ్యాలు

విదేశాల్లో ఒకరికొకరె దురైతే - మీదే పార్టీ అని అడుగు తారు
మన పుణ్య భూమిలో నయితే - మీదేకులమని అడుగుతారు, అదో కుశల ప్రశ్నలా

కులమన్నది ప్రశ్నకాబోదు- గుణం గొప్పదైన నాడు
రఘుకులగురువైన వాసిష్ఠుని కులమేదో ఎరుగరా?

అతని తల్లి ఊర్వశి దేవ వేశ్య - తన పెండ్లాము అరుంధతీదేవి ఓ మాదిగకన్య
అయిననూ బ్రహ్మర్షిగా - జగతి లో వాసికెక్క లేదా?

ఆదిశంకరు లొకపరి దారితొలగ మంటాడు- ఒక హరిజనుడ్ని
ఆ హరిజను డిచ్చిన జవాబుకు - తలతిరిగి సాష్టాంగ పడలేదా?

అధికులనీ, అధములనీ - అంతర్యాలు పాటించుట పాడిగాదు
భరతుడేలిన రాజ్యంలో- అంతాభారతీయులేనని గుర్తెరగండి

గుణం లేని మనుజుని - కులం తీర్చి దిద్దగలదా?
కుల మేదైనా మతమేదైనా - మానవత్వమే మనిషికి వన్నె తెస్తుంది

అజ్ఞానులు సృష్టించారు - అంట రాని వారని హరిజనుల్ని
స్వార్థ పరులు కల్పించారు - కడజాతి వారని పంచముల్ని

బాంధవ్యాన్ని కలుపుకోమని బ్రతిమాలి - వెంట బడటం లేదే!
మానవత్వ మెరిగి మిత్రులుగా - వారిని సమాజంలో తిరుగ నిమ్మంటున్నారు

జంతువులను సైతం ఇళ్ళల్లో - తిప్పుకుంటున్నా రే!
తోటి మానవులైన హరిజనులు - అంటరాని వారెలా అవుతారు?

అమాయకులను, అంటరాని వాళ్ళనుట - తుంటరివాదన
అది జాతిని నాశనం చేస్తుందని - తెలియకున్నారు అజ్ఞానులు

హరిజనులు అంటరాని వాళ్ళు కాదు- దేశాన్ని దోచుకుంటున్న వాళ్ళే అంటరానివాళ్ళు

ప్రభుత్వ జీతాలు మెక్కుతూ - ప్రతి పనికీ లంచాలు మేసే కక్కుర్తి నాయాళ్ళు అంటరాని వాళ్ళు

అబలలు కన బడగానే అత్యాచారాలకు- పూనుకొనే రాక్షసులు అంటరానివాళ్ళు

క్షణాని కొక పార్టీమార్చి, లక్షలు మింగే రాజకీయ స్వార్థపరులు అంటరానివాళ్ళు

ఎదుటివారి నిస్సహాయతను - సొమ్ము చేసుకొనే మోసగాళ్ళు అంటరానివాళ్ళు
ఈ రకపు అంటరాని వాళ్ళెంత కాలమున్నా - దేశానికి అభివృద్ధి మాత్రం సున్నా

కమలం పుట్టింది - బురదలోనని ఎరుక లేదా?
అది కాలేదా మహలక్ష్మికి - ఆనంద నిలయం?

ఈ కుల వ్యవస్థను - కూకటి వ్రేళ్ళతో పెకలించండి
ఈ కులం అడ్డ గోడల్ని కూల్చి వేయండి- అందరూ సమానమేనని చాటి చెప్పండి.

# 17. నూతన సంవత్సరానికి స్వాగతం

నూతన సంవత్సరానికి - స్వాగతం !
సౌభాగ్య ప్రదాయినికి - సుస్వాగతం!

ఆశల సౌధాలలో విహరింపజేసే - ఆనందప్రదాయినికి స్వాగతం!
కోర్కెల గుత్తాలపై స్వారీచేయించే - నూతన వత్సరానికి కొసరి కొసరి స్వాగతం!

ఈ నూతన సంవత్సరారంభం - కావాలి మనకు చిరుదివ్వెల సరాగాల సందోహం,
ఈ నూతన సంవత్సరాది - కావాలి మనకు వినూత్న చైతన్యానికి పునాది.

ఈ దినం బహు సుందరం - మధురాను భూతులు వెదజల్లే పరిమళ కుసుమం

ఈ రోజు సుందర స్వప్నాల సంజనితం - నవయువ్వన ప్రేరిత మధుర స్వప్నం

సమస్యల నైరాశ్యంతో మసకబారిన కన్నులు - వెన్నెల దీపాలతో వెలుగొందే రోజు
మన ఆశలమేడలు - బంగారు తోరణాలతో తళతళ మెరిసే రోజు

ఇది ఎల్లలు లేని వెలుగు వెల్లువలు వెదజల్లే - మల్లెల సుగంధాల స్వాగతసంకేతం
ఇది మన జీవిత ఉద్యాన వనానికి -ఆనంద గులాబీల సౌగంధ, సౌరభాలు గుబాళించే శుభారంభం

మన సంసార సాగరాలు - రాగసుధారసలతో తరంగాలుగా ఉవ్వెత్తున లేవాలనీ
మన జీవన గమనంలో - విజయానంద కేతనాలు రెపరెపలాడుతూ ఎగరాలనీ

మన కర్తవ్య నిర్వహణలో - అధికారుల ఆవేశాలకు అపార్థాలకు తావుండరాదనీ

మజ్దూర్ నుండి మహోధి నేత వరకూ- అరమరికలు లేకుండా సాదరంగా మెలగాలనీ

ఈ నూతన సంవత్సరం - మనకందరకు వెలుగు బాట చూపించి శుభం చేకూర్చాలనీ
ఆ సర్ప ధరుడు, కందర్ప హరుడూ అయిన సదాశివుని వేడుకొంటున్నాను.

# 18. చేనేత కార్మికుల ఆక్రందన

మా 'రక్తాన్ని' అణుస్తున్నామని - సంబర పడబోకండి
మా 'ఆకలి' ని బూటు కాళ్ళక్రింద - నలుస్తున్నామని కలలు కనకండి

మా కోర్కెల్ని పిడికిట్లో బిగిస్తున్నామని - భ్రమపడబోకండి
మేము మీ రనుకొంటున్నట్లు - అమాయకులం కామని తెలుసుకోండి

మా నరాల్నే దారాలుగా చేసి- అల్లిన గుడ్డలతో బలిసి పోతున్న యజమానుల్లారా!
ఆ గుడ్డల్లో మా రక్తాన్ని - కసిగా చూసుకొంటున్నాం

మా రక్తమే మిమ్మల్ని కాపాడు తోంది - మా శ్రమే మీకు పునాదయింది
మా రక్తం విలువ మీకు తెలియటం లేదు - అది మమ్మల్ని ప్రేరేపిస్తుంది.

మాకు దాహమేస్తే - కన్నీళ్ళు త్రాగమన్నారు ఇన్నాళ్ళూ
మాకు ఆకలేస్తే - గాలి పీల్చుకు బ్రతుక మన్నారు

మిమ్మల్నింతవరకు పోషించి - మీ సలహాలకు విలువ నిచ్చిన మేము
పెచ్చు మీరిన మీ దౌర్జన్యాన్నిక - ఏ మాత్రం సహించలేం

ఇంత కాలం, మేమిచ్చిన అలుసే - మా కంట్లో నలుసయింది
మేము చూపిన సహనమే - మాపాలిట శాపమయింది.

మమ్మల్ని మట్టు పెట్టడానికి - మీ తొత్తులతో కుట్రలు పన్నుతున్నారు
మీ కుట్రను బద్దలు కొట్టి - మీ తొత్తుల పెత్తనాన్ని తుత్తునియలు చేస్తాం

మా పోరాటం ఊపిరిగా - తిరుగుబాటు తరహాగా
మీ దోపిడీ కంచుకోటను - నేలమట్టం చేస్తాం

బొట్టు బొట్టుగా మా నెత్తుటి బొట్లను - విత్తనాలుగా జల్లిన మేము
మీ అధికారాన్ని మట్టు పెడతాం - మీ చట్టాన్ని ముక్కలు చేస్తాం.

# 19. కర్మయోగి

వెలిసింది అలనాడు భాగ్యనగర దూర్వాణి మండలం శ్రీ S.G.K. రెడ్డి గారి అధ్వర్యంలో
వెల్లివిరిసింది యీనాడు బ్రహ్మమానస పుత్రులైన శ్రీరామ సుబ్రహ్మణ్యం గారి ప్రాపకంలో

శ్రీ సుబ్రహ్మణ్యంగారి రాకతో ఈ హైదరాబాదు దూర్వాణి మండలం నిలువెల్ల పులకించింది

12 ఎక్స్ఛేంజిలు లక్షానలుబది టెలిఫోన్లుగ ప్రవర్ధమాన మయ్యింది

అడుగు పెట్టారు ఆంధ్రదేశంలో, అందించారు వారి శక్తియుక్తులు రేయింబవలు పూయించారు ప్రగతి పూలను ప్రతి యేటా- వెదజల్లారు ఆనంద గంధాలు ప్రతియింటా

మన గుండెల్లో ప్రగతి చిత్రాన్ని శాశ్వతంగా నింపి వుంచాలని ఉవ్విళ్ళూరిన మహాశిల్పి!

దశాబ్దంపై చిలుకు ఈ తెలుగునేలను చమటతో తడిపి వాడి పోనిపూలను పూయించిన చక్కని తోటమాలి!

మాటల్లో మంచి తనం, మనసులో మార్ధవం కల్గిన సౌజన్యమూర్తి!
చూపుల్లో చల్లదనం చేతల్లో కమ్మదనం కురిపించిన అమృతమూర్తి!

పనికి పూనుకోని పరివారంలో సైతం, పరివర్తన కల్గించి, పనివైపు మళ్ళించిన ప్రజ్ఞాశాలి!

నిదురిస్తున్న ఫైళ్ళకు చైతన్యం కల్గించి ముందుకు నడిపించిన ఇంద్రజాలి!

వినియోగ దార్ల విమర్శలకు చెక్కు చెదరని ఉక్కుమనిషి!
కర్తవ్య నిర్వహణలో పట్టు విడువని విక్రమార్క చక్రవర్తి!

అగ్రకులాలపట్ల ఆసక్తి మెండని, ఇతర కులాలపట్ల, యీ సడింపెచ్చని అన్నారు కొందరు అమాయకులు

కష్టించి పనిచేసిన వారి నిష్టపడుదునని, తప్పించుకుతిరిగే వారి నీ సడింతునని ఋజువుచేసిన ధర్మ మూర్తి!

ఎవరేమన్నా, ఎన్ని కష్టా లెదురైనా అనుకున్న ప్రగతిని సాధించగల్గిన సాహసమూర్తి!
ఎన్ని ఉద్యోగాలు చేసినా, ఎన్ని అవకాశాలొచ్చినా అక్రమార్జనకు తలవంచని నిస్వార్థమూర్తి!

ఆశ్రిత పక్ష పాతం అవినీతికాదరణ - మచ్చుకైనా కానుపించని మహా మనీషి!

మానవత్వమే మనుగడగా కార్య దీక్షయే కర్తవ్యంగా భావించిన కర్మయోగి!

చీకటి వాకిళ్ళలో వెన్నెల తోరణాలు నిర్మించాలని, అహర్నిశలు కృషిసల్పిన విశ్వకర్మ!

వెలుతురులో గుండెల్ని కదుక్కొని - చీకటి ఘాతుకాలను నేలమట్టం చేసిన ధైర్యశాలి!

వారూ, వారి కుటుంబం ఎక్కడవున్నా పదికాలాల పాటు పదిలంగా ఉండాలనీ!

ఆ పరమశివుడు ఎల్లవేళలా - చల్లగ చూడాలనీ మనమంతా మన సారా కోరుకుందాం!

# 20. చిత్రమైన మనుషులు - విచిత్రమైన లోకం.

మనిషి. తనఅనుమతి లేకుండా - ఈ ప్రపంచంలోకి పుట్టుకు వస్తున్నాడు
తన ప్రమేయం లేకుండా - ఇష్టం లేకుండా వెళ్ళి పోతున్నాడు

ప్రపంచంలో దురభిప్రాయాలకు - అపోహలకు గురవుతున్నాడు
బాల్యంలో దేవతా మూర్తిగా - కౌమారంలో కొరకరాని కొయ్యగా వుంటాడు

పెళ్ళికాని బ్రహ్మచారిగా - అతిక్రూరుడౌతాడు,
పానశాలలో దూరితే - తాగుబోతు అంటుందిలోకం

ఏ అలవాటు లేకపోతే - పరమ లోభుడు, ఛాందసుడు అంటుంది
శ్రీమంతు డయితే - అదృష్ట వంతు డంటుంది

దరిద్రుడయితే - వివేక హీనుడంటుంది
విజ్ఞాను డయితే - సూక్ష్మబుద్ధి కలవాడంటుంది

గుళ్ళూ- గోపురాలూ సందర్శిస్తే - కపటవేషాలు వేసే వంచకు డంటుంది
దేవాలయాలకు వెళ్ళకపోతే - పరమ ఛండాలు డంటుంది.

దానధర్మాలు చేస్తే - గొప్ప కోసం చేస్తున్నాడంటుంది లోకం
ధర్మం చేయకపోతే - పిసినారి అంటుంది యీ లోకం

వృద్ధాప్యం వచ్చేదాకా జీవిస్తే - విల్లు రాసి వుంటాడని ఆశిస్తుంది
తొందరగా తనువు చాలిస్తే - అల్పాయుష్కుడంటుంది యీ పాడులోకం

మనిషి ఎలా జీవించినా - లోకం విమర్శనాస్త్రాలకు బలౌతూనే వున్నాడు
అందుకే ఈ లోకాన్ని గురించి పట్టించుకోకు - భగవంతునిపై భారం వేసి బ్రతుకు.

# 21. స్వాతంత్ర్యం - ప్రగతి

మన స్వాతంత్ర్యానికి - నిండాయి నలుబది మూడేళ్ళు
కాని, మన దారిద్ర్యానికీ, దౌర్జన్యాలకు - నిండలేదు నూరేళ్ళు

వెనుక బడ్డ తనానికీ, నిస్స హాయతకు - చెల్లలేదు కాలం
నిరాశా ఇస్పృహలకు - రాలేదు అంతిమ ఘడియలు,

వర్ధమాన దేశాల్లో కెల్లా - అగ్రగామిగా ఉన్నాం మనం
సాంకేతిక రంగాల్లో స్వర్గానికి - వేస్తున్నాం నిచ్చెనలు,

భూమ్మీద నిలబడ్డానికి సత్తువ లేక - జారి పడుతూ వున్నాం
ఉపగ్రహాలను విజయ వంతంగా - ప్రయోగిస్తూనే వున్నాం

దూరదర్శనాలను దగ్గరగా - చూస్తూ మురిసిపోతున్నాం
కళ్ళెదుట వున్న ధన దాహాల శనిగ్రహాలను - గుర్తు పట్టలేక పోతున్నాం

స్వాతంత్ర్యం తెచ్చుకోవడానికి - రక్తాన్ని ధారపోశామానాడు
స్వేచ్ఛగా మాట్లాడు తున్నందుకు - రుధిరాన్ని కక్కుకుంటున్నా మీనాడు.

బ్రిటిష్ వారి గులాములు కాబోమన్నందుకు - కటకటాల పాలయ్యా మానాడు
స్వరాజ్య ఉద్యమంలో పాల్గొనేందుకు - కుటుంబాలను ఏళ్ళ తరబడి వదలి పెట్టాం

స్వాతంత్ర్యం తర్వాత ఓరాజా రామ్మోహన రాయ్‌ని, ఓ కందు కూరిని గొప్ప వాళ్ళుగా గుర్తించాం
వాళ్ళ పేర్లు చరిత్రపుటల్లో సువర్ణాక్షరాలలో - లిఖించుకున్నాం

కనుక మనం ఎంత మంది స్త్రీలను - చెరచినా ఫరవాలేదు
ఎంత మంది వధువులను - కిరోసిన్‌తో కాల్చి చంపినా తప్పులేదు

మనం గాంధీగారిని గౌరవిస్తాం - దేవుళ్ళ సరసన పెట్టి పూజిస్తాం
కనుక హరిజనుడ్ని గొడ్డును బాదినట్లు - బాదినా తప్పులేదు.

మనం రాజ్యాంగాన్ని నెత్తిన బెట్టు కుంటాం - రాసిన వాళ్ళను గొప్పగా కీర్తిస్తాం
కాని దాన్నమలు పర్చమంటే - బస్సులూ, రైళ్ళూ తగులబెట్టేస్తాం

మనం ఐకమత్యంతో, త్యాగనిరతితో - స్వాతంత్ర్యాన్ని సిద్ధించుకున్నాం
దేశద్రోహులు దేశాన్ని - ఎలాదోచుకు తింటున్నారో చూస్తున్నాం

మన స్వాతంత్ర్యపోరాటం, ప్రపంచ చరిత్రలోనే - చిరస్థాయిగా నిలిచిపోయింది
ఇక మన యింట్లో తండ్రీ కొడుకులు -కత్తులతో నరుక్కున్నా తప్పులేదు.

మనకు బోలెడు చరిత్రవుంది, ఘనమైన సంస్కృతి వుంది
పాస్ మార్కు లివ్వలేదని గురువును శిష్యుడు - చీల్చిఛెండాడినా కిమ్మనకూడదు.

అందరూ అసూయపడే వాఙ్మయం వుంది - దేశాలన్నిటినీ నడుపగల 'విజ్ఞానం' వుంది
కానీ, మనకు ప్రక్కవాని ఉన్నతిని చూడలేని - కుళ్ళుబోతు తనమూవుంది.

ఎదురింటాయనను రౌడీలు చంపుతుంటే - చూసి ఆనందించే "శాడిజం" వుంది
మగవాడు ఎన్ని తప్పుడు పనులు చేసినా - క్షమించగల ఔదార్యం వుంది.

ఆగష్టు పదిహేనున వీధివీధికీ - జాతీయ పతకాలు ఎగురవేస్తున్నాం
గాంధీగారి అహింసా వాదాన్ని , నెహ్రూ గారి సామ్యవాదాన్ని వుపన్యసిస్తున్నాం

ఆ మరునాడు మనకులం కాని వాడ్ని - కర్రలతో చావగొడుతున్నాం
మనమతం కాని వాడ్ని - మట్టిలో పూడ్చి పెడుతున్నాం

యిలా అనడం ఎందుకంటే యదార్థ రూపాన్ని - మనం గుర్తించడానికి, స్వాతంత్ర్యానికి మనం 'అర్హులమా?' - అని ప్రశ్నించుకోడానికి. -

# 22. వైద్యుడు

మీ చూపు తగిలితే చాలు - రోగికి ఉపశమనం కలుగుతుంది
మీ చేయి తాకితే చాలు - సగం రోగం తగ్గిపోతుంది
మీరు వైద్యం చేస్తే చాలు - రోగం పటా పంచలైపోతుంది.

మీ చూపు వెన్నెలలా చల్లనైనది
మీ చేయి -ఇంద్రజాలం లా అద్భుతమైంది
మీ వైద్యం - అమృతంలా అజరామరమైంది.

మీరు రోగాల పాలిట - భయంకరులు
మీరు రోగుల పాలిట - దైవస్వరూపులు

మీ చూపులో - చల్లదనం వుంది
మీ చేతిలో - ఇంద్రజాలం వుంది
మీ వైద్యంలో - అమృతత్వం వుంది.

కులమతాల కతీత మయ్యింది - మీ వృత్తి
మీవైద్యానికి విచక్షణ లేదు - దైవంలా నిష్పక్ష పాతమైంది

దొంగ వానికి రోగమొచ్చినా - నక్సలైటుకు బుల్లెట్ తగిలినా
టెర్ర రిస్టుకు చావు మీదికి వచ్చినా

అందరినీ ఆదరించి సమానంగా సేవచేసేది డాక్టరొక్కడే
సమ సమాజాన్ని అక్షరాలా అమలు పరిచేది వైద్యుడొక్కడే

రాజకీయనాయకులకు - సమానత్వం ఉపన్యాసాల్లో వుంటుంది
కాని వైద్యునికి - చేతల్లోనే ప్రతిబింబిస్తుంది సమానత్వం

వైద్యానికి లేవు - పేద ధనిక తారతమ్యాలు
లేవు భాషా, లింగ బేధాలు వైద్యానికి

కాల నియమం పాటించరు వైద్యులు
దైవం ప్రాణం పోస్తాడు - డాక్టరు ఆరోగ్యాన్ని కాపాడు తాడు

జీవన రాగంలో - అపశృతిని సరిచేస్తాడు డాక్టరు
బ్రహ్మ సృష్టిని చేస్తాడు- వైద్యుడు దాన్ని కాపాడుతాడు
లేని ప్రాణాన్ని దేవుడు ఇస్తే - వున్న ప్రాణాన్ని వైద్యుడు రక్షిస్తాడు.

## 23. ఓ మనసా....

సంతోష పడబోకు సంపదల్ గలుగునప్పుడు
దుఃఖించ దగదు - దారిద్రం నిన్ను వరించునపుడు

ఎల్లకార్యముల నుండు ఈశ్వరుడు
నమ్మి జీవించు నిరతమ్ము ఆ విశ్వనాధుడ్ని.

పరుషంబు లాడబోకు - పంతాల పడబోకు
తోటి ప్రాణికి చేయి - వున్నంతలో కొంత సాయం

దూషణ భూషణ తిరస్కారములన్ తలంచు శివార్పణములని,
సంపదలు కల్గు నారికేళ జలముల భంగి
తొలగు సిరులు - పరమశివుని కృపదొలగిన.

ఈ లోకమే ఒక మాయ - తెరచి చూడ
నీవునికి మరో పెద్ద మాయ - నీటి బుడగ మాదిరి

జీవిత పరమార్ధం తెలిసి మసలు - ఉన్న మూడు దినాలు
మాయ మాటలు నమ్మబోకు - నరుల మాయల పడబోకు

నరుల నమ్మిన - మునిగెదవు నట్టేట
నారాయణుని నమ్మిన - ప్రాప్తించును నాకలోకము
మాసిపోవు భవ బంధములు.

# 24. పుస్తకాలు.

పుస్తకాలు - మనుషుల కన్న గొప్పవి
అవి ఎక్కడ వుంటే - ఆస్థలం గొప్పది

ఏ యింటిలో వుంటే - ఆ యిల్లు గొప్పది
ఎవని వద్ద ఉంటే - ఆ వ్యక్తి గొప్పవాడు.

పుస్తకాలలో - గొప్ప గొప్ప వ్యక్తులు ప్రతి బింబిస్తారు
వాటిలో - గడచిన చరిత్రలు, పురాణాలు, ప్రక్షిప్తమయి వుంటాయి

వాటిలో - సంగీతం, సాహిత్యం, భాష యిమిడి వుంటాయి
వాటిలో - ఆచారాలు, మత సాంప్రదాయాలు కలిగివుంటాయి

ఎవ్వరూ చెప్పలేని - ఉన్నత కథలు, అత్యున్నత వేదాలు చెబుతాయి
ఎవరూ చూపలేని - చక్కని ప్రకృతిని, వింత వింత జంతువుల్ని చూపుతాయి

ఎవరకీ తెలియని - ప్రపంచ దేశాల్ని తెలుపుతాయి
ఉన్నతమైన పర్వతాన్ని - అవనత మౌతున్న జలపాతాల్ని చూపుతాయి

వాటిలో - వింత వింత పక్షులను వీక్షించ వచ్చు
కన్నుల పండుగ జేసే - చిత్ర విచిత్రమైన, అందమైన మొక్కల్ని, పూవుల్ని చూడవచ్చు.

దాచుకున్న దేవాలయాల్ని, అందరి దాగిన దేవుళ్ళను దర్శింపచేస్తాయి.
మలచిన శిల్పాల్ని - చెక్కిన శిల్పిని చూపెడతాయి

అవి అందమైన అమ్మాయిల సోయగాల్ని చూపి - మనస్సుకు ఆనందాన్ని కల్గిస్తాయి
జీవితాన్ని చాలించిన - మన పూర్వీకుల్ని చూపెడతాయి.
మనం నిత్యం తలచుకొని - ఆరాధించి ప్రేమించే వ్యక్తుల్ని ఎదుట నిలబెడతాయి

వాటి విలువ ఏమని పొగడగలను? - - ఎంతని చెప్పగలను?
మనిషిని మనిషిగా తీర్చిదిద్దే - ప్రాణం లేని పవిత్రమైన గ్రంథాలు

అవి అక్షర రూపంలో వెలిసి - అమృత హృదయాన్ని కలిగిన చిరంజీవులు
అవి హృదయా రణ్యంలో - దివ్యజ్యోతుల్ని వెలిగించే దీపకళికలు.

మనిషి మనుగడను శాసించగల్గే ఆదర్శమూర్తులు
మనో వికాసాన్ని కల్గించే - అమృత గుళికలు

అవి మార్గాన్ని చూపించే - బాటసారులు
ఎడారిలో పయనించే వారిపాలిట - ఒయాా శిస్సులు

అవి రమణీయమైన ప్రకృతిని - రమ్యమైన కాంతుల్ని ప్రసరించే క్రాంతి దాతలు
మానవాళి మనోభావాల్ని - ప్రతిబింబించే మూగజీవులు

అవి హృదయాల్ని పట్టి కదిలించే - అ చేతన ఆకృతులు
అవి రాజ్యాల్ని నిలబెట్ట డానికి, కీర్తి ప్రతిష్ఠల్ని సముపార్జించడానికి ఉపయుక్తాలు

అవి బాల్యంనుంచి పసిపిల్లల మనసుల్ని - చక్కగ మలిచే ఆయాలు
బాలల్ని భావి భారత పౌరులుగా - తీర్చి దిద్ద గలిగే పెద్దరికాలు

పుస్తకం - ఒక మిత్రుడితో సమానం!
పుస్తకం - ఒక శాంతి కపోతం!
పుస్తకం - ఒక ఉద్యమం!
పుస్తకం - ఓ జీవితం!

# 25. భర్తల కోరికలు

అందమైన అనుకూలమైన - చదువూ సంస్కారం గల భార్య కావాలనీ
పనులు ముగించుకొని యిల్లు చేరేటప్పటికి - ఇల్లాలు చిరునవ్వుతో ఎదురు రావాలనీ

ఆ ఆనందంలో పడిన శ్రమనంతా - మరచిపోయి సేద తీర్చుకోవాలనీ
కమ్మని కాఫీనందించి - తీయని కబుర్లు చెప్పాలని ప్రతి భర్తాకోరు కుంటాడు.

**కొందరి కోరిక లేమంటే**

అయ్యాగారు యింటికి చేరగానీ- అమ్మగారు చేసే పనిని విడిచి సూటూ బూటూ విప్పాలనీ
వేడినీటితో స్నానం చేయించి - రుచి కరమైన వంటకాల్ని కొసరి కొసరి తినిపించాలనీ,

రాత్రి పార్టీకెళ్ళి, పన్నెండు గంటలకొచ్చినా - భార్య భోంచేయకుండా వేచివుండాలనీ
ఆలస్యానికి కారణం అడక్కుండా - నిద్ర వచ్చేదాకా మెత్త మెత్తగా కాళ్ళు వత్తాలనీ

మోతాదుకు మించి మధువును సేవించి వస్తే - ఇంత మజ్జిగ పట్టించి పక్కమీద పడుకో బెట్టాలనీ,
పాపం ఆడకూతురు, ఆరాత్రి తిండి తిన్నా, లేకున్నా - కిక్కురు మనకుండా సేవలందించాలనీ

తాము బజారంట బలాదూరుగా తిరిగినా - తమ భార్యలు మాత్రం పంచ దాట కూడదనీ
ఉంచుకున్న దాన్ని ఇంటికి తీసుకొచ్చినా - చీదరించకుండా ఆదరించాలనీ అనుకొంటారు.

**మరికొందరు**

తమ సతీమణులు స్టైలుగా వుండాలనీ - రమ్మనగానే ఐదునిమిషాల్లో రెడీ కావాలనీ,
పది నిముషాల్లో కాఫీ పెట్టివ్వాలనీ - క్లబ్బుకెళ్ళి అందరిలా తనతో ఆమెకూడ డాన్సు చెయ్యాలనీ,

చక్కగా యింగ్లీషు మాట్లాడుతూ - చకచకా వ్యవహారాలు చక్క బెట్టాలనీ భార్యలకు బాల్ రూమ్ డాన్సులు రావాలనీ - ఇంటికొచ్చిన అతిథులకు ఆదరంగా మర్యాదలు చేయాలనీ భావిస్తారు.

నిజానికి

చురుకు దనం ప్రదర్శించి - అతిథుల్ని ఆనందంగా ఆదరిస్తే ఎంతమంది మగాళ్ళు హర్షిస్తారు?
స్టైలుగా వుండి ఇంగ్లీషు మాట్లాడుతూ - క్లబ్బులకెళ్ళే భార్యలను ఎంత మంది భర్తలు భరించగలరు?

అందమైన అర్ధాంగులను అనుమానిస్తూ - చిత్రహింసలకు గురిచేయని పురుషులెంత మందున్నారు?
ఆడదంటే మగవాళ్ళకు అణిగిమణిగి వుండాలనీ - వాళ్ళనందుకే బ్రహ్మపుట్టించాడనీ భావించని వారెంత మందున్నారు?

అందుకే

లేని వాటి కొరకు బాధపడకుండా - ఉన్నవాటితో తృప్తి పడటం నేర్చుకోండి ప్రేమానురాగాలు పంచుకొని, భార్యా భర్త లిరువురూ ఆదర్శదంపతులుగా బ్రతకండి.

## 26. పరుల మేలు కోసం-బ్రతుకు

చెట్లు అందిస్తాయి నవరసాలొలికించే ఫలాలు
మేఘాలు కురిపిస్తాయి ప్రాణాల్ని నిల్పే జలాలు

విత్తనాలు పగులు తాయి - మొక్కలు మొలవడం కోసం
కొవ్వొత్తులు కాలుతాయి - వెలుగులనివ్వడం కోసం

అక్షరాలు కలుస్తాయి - మాటల పొందిక కోసం
స్వరాలు కలుస్తాయి - సంగీత సరాగాల కోసం

అందరిలో కుళ్ళుందని - అరుస్తూ కూచోకు
అందించు నీవంతు సహకారాన్ని - సంఘాభివృద్ధికోసం

కులమతాల విభేదాలతో - పనిలేదు నీకు
వర్ణ వర్గ వివాదాలతో సంబంధం లేదు నీకు

భాషా, ద్వేషాల జోలికి పోబోకు
సమభావంతో ఎగరేయి - పతకాన్ని గగనంలోకి

చెట్టుకు - మట్టికి ఏముంది సంబంధమని - అడగబోకు
గువ్వకు గూటికి ఏమిటి, అనుబంధమని - ప్రశ్నించకు

అది మాటకు నోటికి సంబంధమని తెలుసుకో
అది ప్రజలకు, దేశానికి వున్న అనుబంధమని మరువకు.

# 27. శ్రీ ఎమ్. ఆర్. సుబ్రహ్మణ్యంగారు

సాంకేతిక కళా ప్రపూర్ణులు- శ్రీ ఎమ్. ఆర్ సుబ్రహ్మణ్యంగారు
గాంభీర్యంతో పాటు సౌకుమార్యం- సంతరించుకున్న సౌమ్యులు

జలతారు దారాలు అల్లగల- బహునేర్పుగల విశ్వకర్మ
మధువులో తీపి, సువాసనలున్నట్లు- జాలీ, కరుణ మేళవించిన నిండు హృదయం,

వీరి కృషి నిత్యయవ్వన సమన్వితం
వీరి ప్రగతి దశ వసంతాల విలసితం

నైశిత్య మొకవంక ఔచిత్య మేరొక వంక కలిగిన ప్రతిభాశాలి!
సౌలభ్య, సారస్యతల మేలు కలయిక ఈ సుగుణాలరాశి!

వీరి పరిపాలనా పాట వాలకు ఆంధ్రమాత పులకించింది
వీరి ప్రగతి, ఆంధ్ర దేశ వాడవాడల క్రాంతి పూవులై విరిసింది

వీరి నేర్పు వివిధ కళా రంగాల వ్యాపించి ప్రజ్వరిల్లింది
తెలుగు తల్లి సిగలోన మెరయు నెలవంక వెండి పూవై మెరిసింది

వీరి ఆదరణ ఎదలను నింపి కదలించి పొంగే తుంగభద్ర
వీరి కరుణ ఎల్లవేళల చల్లగ ప్రవహించి, పారే గోదావరి

ఆధునిక, సాంకేతిక ప్రక్రియలకు మేలిమిలందిన మహాశిల్పి!
సేవా బృందానికి వీరి మెచ్చుకోలు మంచి గంధాలు చిందించే సువాసనలు

సాంకేతిక సుమాలు దూసి, తెలుగు తల్లి కందించిన సౌజన్యమూర్తి!
కమనీయ కృషి సల్పిన కర్మ యోగికి- ఆంధ్రజాతి నీరాజనాలు!
భాష లెన్నో కలవు - ఏ భాష నెన్ను కొందు వీరి ప్రతిభ పొగడ!

ఏ బిరుదులు సరిరావు - ఎదనిండె తన్మయాన
వాణి, విపంచి మీటి దీవించు ఈ కళా ప్రపూర్ణుని

సాధుపక్షానికి చెందిన సదసద్వివేకి
వీరు నిర్వహించిన ప్రక్రియలు - నిత్యం ప్రకాశించే వెలుగు దొంతరలు

వీరికింకనూ కృషి సల్పుటకు - ఆ నీలకంఠుడు
ఇతోధిక శక్తి నొసంగ వలెనని వేయి వేల ప్రార్థనలు.

# 28. నేనిలా ఎన్నడూ ఊహించలేదు

తేనె లాంటి తీయని పలుకులు విన్పించే కంఠంలో
కటిక చేదులాంటి గరళం, దాగుంటుందని

బంగారం లా మిల మిలా మెరిసే సంఘంలో
పనికి రాని తుట్టపురుగులు వుంటాయని

సున్నితమైన పువ్వులాంటి మనసు చాటున
వంచన అనే వాడియైన ముళ్ళుంటా యని

చల్లని సానుభూతిని తెలిపే కళ్ళు మాటున
స్వార్థంతో అల్లుకున్న సాలెగూడుంటుందని

ఆదర్శాలు వల్లించే అందమైన తెరచాటున
కసికసిగా ఉసి గొలిపే పశుత్వ ముంటుందని

మొగలి రేకు వంటి అందమైన జగత్తులో
విష జ్వాలల్ని ఎగజిమ్మే కాలనాగులు బుసలు కొడతాయని
నేనిలా ఎన్నడూ ఊహించలేదు.

# 29. నిస్వార్థ పరుడు (శ్రీ నాయనగారు)

తాను నమ్మిన సిద్ధాంతాలకోసం - అసువులనుసైతం పణంగా బెట్టిన ధైర్యాసాలి!
పార్టీని పండించడం కోసం - చేజిక్కిన సదవకాశాన్ని తృణప్రాయంగా నెంచిన నిస్వార్థమూర్తి!

తోటి వారెందరో పార్టీ ముసుగులో - పబ్బంగడుపుకొని బొజ్జలు నింపుకోగా పాపం పసివారని జాలి చూపిన - దయాశాలి!

ఎవరేమన్నా, ఎన్నికష్టాలెదురైనా- దేశభక్తిలో పట్టుసడలని పరాక్రమ శాలి!
శ్రవణ చక్షువులు నియమం తప్పినా - క్రమం తప్పకుండా కర్తవ్యనిర్వహణలో పట్టువిడువని విక్రమార్కుడు!

రామ రామంటూనే, చాటుగా గోతులు తీసే- ఘాతకుల గాలిని సైతం భరించలేని పుణ్యమూర్తి!
మానవసేవయే మాధవసేవయని గుర్తెరిగి - కనిపించని మాధవునికోసం కాలం వృధాపుచ్చని మహావిజ్ఞాని!

మానవత్వమే ఊపిరిగా మమతయే ఆయువుగా - మనుగడ సాగించే మహామనీషి!

ఎవరు ఆ మహనీయుడు? ఎవరు ఆ పుణ్యమూర్తి ? ఎవరు ఆ మహా మనీషి?
వారే నాయనగారు అని పిలువబడే శ్రీ కొప్పన కొండల రావు నామధేయులు మల్లాం వాస్తవ్యులు, వారికివే నా గౌరవ పూర్వక సుమాంజలులు!
వారికి ఆ ఈశ్వరుడు ఆయురారోగ్య ఐశ్వర్యములను ప్రసాదించుగాక!

# 30. స్వాతంత్ర్య దినం

నేడే స్వాతంత్ర్యదినం - బానిస సంకెళ్ళ బారినుండి విముక్తి పొందిన దినం
భారతావనికి పర్వదినం - ప్రతి భారతీయుని హృదయంలో వసంతం చిందిన దినం

ఈ భారతావని వేద నాదాల రసధుని - జీవనదులు ప్రవహించే అమృత ధ్వని
సుందర మధురాను భూతుల మందిరమిది - అది భౌతిక, ఆధ్యాత్మిక సంపదల నిలయమిది

ఇది వేదం పుట్టిన చోటు - జనవేదం పలికిన చోటు
మహాభారతంజరిగిన క్షేత్రమిది - రమ్య రామాయణం వెలిసిన భూమియిది

సత్యం జయించిన చోటు - అహింసనే ఆయుధంగా ప్రయోగించిన చోటు
భిన్నత్వంలో ఏకత్వం సాధించిన చోటు- హిందూధర్మం విశ్వహృదయాన్ని అధిరోహించిన చోటు,

"బుద్ధం శరణం గచ్ఛామి" అని మానవాళిని మహోన్నతాదర్శాల నడిపించిన చోటు,
"అల్లా హో అక్బర్" నాదం - జనం గుండెల్లో - మేలుకొలిపిన చోటు
"జీసస్ క్రైస్తుకి" నిండు హృదయాలతో- నివాళు లర్పించిన చోటు
"నానక్" "మహావీరుల" పుణ్యాగాథలు నిరతమ్ము స్మరించే చోటు

పవిత్ర "గంగా, యమున, కృష్ణా, గోదావరీ" నదులు పరవసించి ప్రవహించేనేల
పరమాత్మని అన్ని మతాలలోను - దర్శించిన పుణ్య భూమి యిది

బానిస బంధనాలక్రింద మూల్గులు విడుస్తున్న జాతిని జాగృతం చేసిన మహాత్మా!
ఓ బాపూ! నీవు వేసిన పందిరికి అల్లుకున్న శాంతి పూలు వాడి పోకుండా చూసుకొనే స్థైర్యం మాకివ్వు!

నీ మాటకు పులకించి, నీ బాటలో స్వరాజ్య సమర శంఖారావం ఆలపించిన అమరవీరులను తలచుకుంటూ
నీ నినాదాన్ని జనవేదంగా జగత్ కల్యాణ మంత్రంగా భావించి నీ ఉద్యమంలో ప్రాణ తర్పణ చేసిన అమరవీరుల త్యాగాలకు, ఈ రోజు అభివందనం చేస్తున్నాను.

నీవు లేవు బాపూ! నీవు వేసిన బాట వుంది, నీవు లేవు మహాత్మా! నీ విచ్చిన సందేశం వినిపిస్తోంది.

నీ చిత్రం, నీ చరితం, నీ భాష్యం, మాకు వేదంగా, నాదంగా నినదిస్తూనే వుంటుంది.

"ఏదేశమేగినా ఎందుకాలిడినా పొగడరా నీతల్లి భూమిభారతిని"
"సుజలాం! సుఫలాం ! సస్యశ్యామలాం!" అనే భావం మన గుండెల్లో క్రాంతి శంఖాలై

నినదించాలని సమైక్యరాగం, మానవాళి గుండెల్లో జ్ఞాన జ్యోతులై దేదీప్య మానం కావాలని ప్రతిజ్ఞ చేద్దాం!

సత్యం శివ సుందరాత్మకమైన ఈ సమైక్య భారత మహాయజ్ఞ విజయానికి అందరం కలసి సమైక్య గీతం ఆలపిద్దాం! అన్ని భాషలకీ, అన్నిభావాలకీ

అన్ని మతాలకీ సమైక్యంగా భారతీయాత్మతో పచ్చతోరణం కడదాం!
చలువ పందిరి నిర్మించి - వెన్నెల బావుటాలు ఎగురవేద్దాం!

# 31. రూపం ఒకటే - సామార్థ్యం వేరు

ఉప్పు కర్పూరాలు - ఉంటాయి ఒకే పోలికలో
వాటి రుచులు - ఉంటాయి వేరు వేరు రీతుల్లో

కాకి కోకిలలు - ఉంటాయి, ఒకే రంగులో
వాటి గుణాలు - ఉంటాయి, వేరు వేరు విధాల్లో

వసంతంలో కోకిల - ఊ(ర్రూత లూగిస్తుంది తన గానామృతంతో
కాకి కలిగిస్తుంది ఈసడింపు తన వికృత చేష్టలతో

కార్బన్ డైఆక్సైడు - ఆక్సిజన్ - ఉంటాయి ఒకేమాదిరిగా
వాటి ధర్మాలు - ఉంటాయి రకరకాలుగా

కార్బన్డై ఆక్సైడు - ఆర్పుతుంది మంటల్ని మేలు మేలుగా
చేస్తుంది కీడు - పీల్చిన ప్రాణులకు త్వరత్వరగా

ఆక్సిజన్ రేపుతుంది - మంటల్ని గాలిలోకి
అది చేస్తుంది - మహోపకారం ప్రాణి కోటికి

స్కూలు యూని ఫారంలో పిల్లలు ఒకే విధంగా కనిపిస్తారు
తెలుస్తుంది వారి సామార్థ్యం - పరీక్షల్లో తలోరకంగా.

# 32. వృద్ధాప్యాన్ని జయించండి

సూర్యోదయానికి పూర్వమే నిద్రలేవండి. రాత్రి పదిగంటలకు నిద్రించండి
ప్రతి ఉదయం లేదా సాయంత్రం మీకు వీలున్న వ్యాయామం చేయండి

ధూమ పానం, మత్తు పానీయాల జోలికి పోకండి - డబ్బు వృధాగా ఖర్చు చేయకండి
మత్తు మందులు, దురలవాట్లకు దూరం కండి. ఆరోగ్యాన్ని చక్కగా వుంచుకోండి

వారానికొకసారి నువ్వులనూనెతో శరీరాన్ని - బాగా మర్ధించుకోండి
ఓ గంట ఆగి, కుంకుళ్ళు లేక సీకాయతో - తల స్నానం చేయండి

ఒత్తిడులకు లోను కాకండి - మనస్సు తేలికవడానికి హాస్యసినిమాలు చూడండి
వీలు కాక పోతే దగ్గఱలో నున్న - దేవాలయానికెళ్ళి దైవాన్ని దర్శించుకోండి

రోజూ ప్రశాంత చిత్తంతో ఓ పావుగంట - మీరు నమ్మిన దైవాన్ని ధ్యానించుకోండి
యిది కూడా మీ జీవితంలో ఓ భాగమేనని - తలచి విధిగా పాటించండి

మానసికాందోళనలకు స్వస్తి చెప్పండి- నవ్వుతూ నవ్వించే వారి చెంతకు చేరండి
మానసికోల్లాసంతో జీవించేందుకు - ప్రతి నిముషం ప్రయత్నించండి

ఆకలి వేసేకే భోం చేయండి - కడుపు నిండేదాకా భోంచేయకండి
శాఖా హారాన్ని భుజించండి - రోజుకు 10 గ్లాసుల నీరు త్రాగండి

మీ శ్రీమతితో ఘర్షణ పడకండి - తప్పని సరివస్తే అక్కడి నుంచి తప్పుకోండి
మనుమల్ని ఆకర్షించడానికి ప్రయత్నించండి -వాళ్ళతో ఆడుకొంటూ పొద్దు పుచ్చండి.

పరులను పరుషంగా విమర్శించకండి - సమస్యల వలయంలో చిక్కుకోకండి
సత్కవితా పఠనం గావించండి - ప్రవేశముంటే మీరూ ఒక కవిత వ్రాయండి

గోరంత విషయాన్ని కొండంతలు చేయకండి - సర్దుకు పోవడానికే ప్రయత్నించండి
పరులకు భారంగా ఉండకండి - వీలుంటే వారికి కాస్తంత సాయపడండి

ఏనాడూ మిమ్ము మీరు కించ పరుచుకోకండి - కోపతాపాల్ని తగ్గించుకోండి
ముఖంపై చిరునవ్వును చెరగనీకండి - స్వార్థాసూయాలకు చోటివ్వకండి
పరమశివుడ్ని ప్రతినిముషం తలచుకోండి - ఆయనే మీ సర్వస్వమని నమ్మండి
ప్రశాంత జీవనానికి పునాది వేసుకోండి - హాయిగా నిదురలో కన్ను మూయండి.

# 33. మద్యపానం

మద్యమంటే పచ్చని కాపురాల్ని - భగ్గున మండించే అగ్ని ద్రావకం
అందాన్నీ, ఆరోగ్యాన్నీ పీల్చి పిప్పిచేసే - రసాయన పిశాచం

చేత పైసలు లేకున్నా ఊరుకోదు - రాక్షస వ్యామోహం
దొంగ తనాని క్కూడా పురికొల్పుతుంది - ఆ తీరని వికృత దాహం

ప్రేమ భగ్నమైతేనే త్రాగేవారు - మద్యాన్ని ఒకనాడు
సొమ్ము లెక్కువై సేవిస్తున్నారు - మధువును ఈనాడు

దిక్కుతోచని స్థితి లోనే ఆశ్రయించేవారు - త్రాగుడును ఒకప్పుడు
ఫేషనుగా బానిసలతున్నారు- సారాకు జనాలు యిప్పుడు

స్వాతంత్ర్యపోరాటానికి స్ఫూర్తినిచ్చాయి - గాంధీగారి ఆశయాలు ఆనాడు
కాంగ్రేస్ వారే తుంగలో తొక్కుతున్నారు - ఆమహనీయుని ఆశయాల్నీనాడు

జాతికి పిలుపునిచ్చాడు మహాత్ముడు - మద్యపానం నిషేధించాలని ఆనాడు

కానీ, ప్రభుత్వమే నెలకొల్పుతుంది - సారాదుకాణాలు సందుసందునా ఈనాడు

ప్రజల్ని మైకంలో పడవేయడానికే - తెరుస్తుంది ప్రభుత్వం వాడవాడలా వారుణి వాహినులను
ఇల్లూ, ఒళ్ళూ గుల్ల చేసు కుంటున్నారు హెచ్చుమంది - ఈ సారాదుకాణాల కారణాన

ప్రభుత్వానికి అక్కరలేదు ప్రజలబాగు - అని అర్థ మవటం లేదా అందరికీ?
ఆబ్కారీ ఆదాయంతో తప్ప నడవవా - ప్రభుత్వ యంత్రాంగాలు?

తమిళనాడు గుజరాతుల్లో - ఎలానడుస్తున్నాయి సంక్షేమ పథకాలు?
చిత్త శుద్ధి ఉంటే సాధించ లేనిది లేదని - గ్రహించాలి కేంద్రరాష్ట్ర ప్రభుత్వాలు

మద్యపానాన్ని నిర్బంధంగా - నిషేధించాలి అన్ని ప్రభుత్వాలు
పూజ్య బాపూజీ కన్న కలలను - సఫలం చేయాలి ప్రతి ఒక్కరూ?

# 34. తుమ్మలా సిస్టర్సు

తుమ్మల వారి ఆడపడుచులు - మందుతున్న కొరకంచులు
ఈ ముద్దు గుమ్మలు - కొరకరాని కొయ్యలు

వీరికి ఆలోచనలు మూడు పాళ్ళు - ఆవేశం ఆరు పాళ్ళు
తాపం ఆరు పాళ్ళు - కోపంపదహారు పాళ్ళు

ఈ సోదరీ మణుల శాస్త్రీలు వేరు - సరుకొక్కటే
ఈ కోమలాంగుల చక్క దనాలు వేరు - సైజులొక్కటే

డబ్బు దగ్గఱ గట్టి గుంటారు - కాపురంలో గుట్టుగుంటారు
వారికిష్టమయింది జరిగి తీరాలి - కష్టమయింది వదిలి వేయాలి

పొగడ్తలకు పొంగి పోతారు - తెగడ్తలకు కుంగిపోతారు
మీ అంతటి వారు లేరంటే - ఉబ్బి తబ్బిబ్బయి పోతారు

వారి నిలువుటెత్తులు ఐదడుగులకు దాటవు
వారి గుండె లోతులు బంగాళాఖాతానికి తగ్గవు

ఓటమిని ఒప్పుకోరు - ఇతరులగెలుపును మెచ్చుకోరు
పట్టిన పట్టు విడువరు - పైసలను గుప్పిటనుండి జార్చరు

వారు ఆదరిస్తే - మమతలకోవెల నెలకొల్పుతారు
వారు ఆగ్రహిస్తే పట్టపగలు అంధకారం సృష్టిస్తారు

వీరు పెంకి తనానికి - ప్రతీకలు
అలాగే మంకుతనానికి - మచ్చుతునకలు

ఆవేశాన్ని అణచుకోలేరు - ఆలోచనకు తావీయలేరు
చేసేది బహు కొంచెం చూపేది మహార్బాటం

యింటి గుట్టును రట్టుచేయరు - వంశగౌరవాన్ని వదిలి పెట్టరు
కాపురంలో గుట్టు - సంసారంలో పొదుపు వీరి ప్రత్యేకతలు

మొత్తానికి మగువలు - పాతివ్రత్యానికి పెట్టింది పేరు
దేవతా భక్తికి - ముందు వరుసలో నిలిచేరు వీరు

ఈ నారీ మణులను కన్న తల్లి తదండ్రులకు కోటిదండాలు
ఈ సతీ మణులను కట్టుకొన్న వారికి శత కోటి దండాలు.

# 35. క్షయనామ సంవత్సర ఉగాది

ఇది తెలుగు సంవత్సరాది - మధుర స్వనాల సప్తపది!
తెలుగువారి వెలుగు జీవితాల కిదినాంది- తెలుగు సంస్కృతికిది పునాది!

పాత పోయి కొత్తకొఱకు - ఎదురుచూసే దినం!
కొత్త పంటలకు - శుభారంభం చేసే సుదినం!

అరకలను పూజించి ఏరువాక సాగే శుభదినం!
పసిడి పంటలు పండించు - అన్నదాతకు మిక్కిలి పర్వదినం!

ఇది భారతం పుట్టిన చోటు - మహాభాగవతం వెలసిన చోటు!
కృష్ణా, గోదావరీ జీవనదులు - వెండితీగలుగా సాగి ప్రవహించే చోటు!

ఉత్తర దక్షిణాల సంధాన సీమ మన తెలుగు సీమ!
పాడి పంటలకు నిలయమై ఒప్పు బహు భాగ్యసీమ!

ఈ ఉగాది సుభసమయాన - తెలుగు ప్రజలు సిరిసంపదలతో తుల తూగాలనీ!
ఆరోగ్యప్రదమైన ఆనంద మయమైన - జీవితాలను పొందాలనీ!

తెలుగు వారి జీవితాలలో - తియ్యం దనాలు నింపాలనీ!
ప్రతి యింటా అనురాగవు - అమృతవు వీచికలు పంచి యివ్వాలనీ

ఈ క్షయ నామ సంవత్సరం - అక్షయమైన శాంతి సుఖాలు చేకూరాలనీ
ఆకరుణామయుడైన - గంగాధరుని వేడుకొంటున్నాను.

# 36. విధి ఆడుకొనే ఆట

ఓ శంకరా!

మనిషికి మనసూ మెదడూయిచ్చి మదన పెడుతున్నా వయ్యా!
ఎదలో వ్యధను కల్పించి నీ యెత్తుకు ఎదగకుండా ఆపుతున్నావు

పశు పక్ష్యాదులకు లేని విచక్షణా శక్తి నిచ్చావు
జీవిత గమనంలో సగ భాగం ఇలానే గడపమన్నావు

ఎందుకయ్యా నీ బిడ్డపై నీకింత ఈ ర్వ్యాసూయలు
తండ్రి తన బిడ్డల అభివృద్ధికి అడ్డు నిలుస్తాడా ఎక్కడైనా?

నీకేల యీ కోపం, యీ బిడ్డలమీద
నీ విచ్చిన యీబ్రతుకు ఏం చేసుకో మంటావు?

ఎక్కడ చూసినా, దౌర్జన్యాలే, దోపిడీలే!
ఏ మూలచూసిన మురికి కూపాలే, కుళ్ళిన వాసనలే

ఏ మనిషిలో వెదకినా మొదట కన్పించేది స్వార్థమే
ఏ మనిషిని కదిపినా ధనార్జనా తలంపులే

ఏ మనిషి ఆర్జనా విధానం చూసినా మోసాల పరంపరలే
ఏ వ్యక్తిలో ఎంత వెదకినా మంచితనం మచ్చుకు కానరాదు

నీసృష్టిలోనే వుందా ఈ లోపం? ఎందుకు నీకీకోపం?
నీవు చేసిన సృష్టికి ఇన్ని వంకరలా? ఇన్ని మతలబులా?

ఎందుకు నీకీ ఆట? ఏల నీకీ విపరీతపు వినోదం?
మనిషిని సృష్టించిందీ నీవే లోపం కల్పించిందీ నీవే

దృష్టి నిచ్చేదీ నీవే అంధుణ్ని చేసేదీ నీవే
వెలుగు నిచ్చేదీ నీవే చీకటి చేసేది నీవే

అందం కల్పించేదీ నీవే అనాకారిని చేసేదీ నీవే
ఏమిటి యీ మాయ ఎందుకు యీ లీల?

బ్రతుకు నిచ్చేదీ నీవే వెతలు కల్పించేదీ నీవే
ఎంతకాలం నీకీ దాగుడు మూతలు

నీ వాడే నాటకానికి తెర దింపవా యిప్పటి కైనా?
నీ మాయను విప్పవా నీ మర్మాన్ని తెలుపవా?

ప్రభూ! ఎందులకీ పరిహాసం! ఆపవా మా పరితాపం?
కరుణించు తండ్రీ! కాపాడు చంద్రశేఖరా! ప్రభూ!

# 37. ఈ దేశానికా నేను వారసుణ్ణి

గంగా, యమునా, సరస్వతుల సంగమంతో పునీతమైన భారతమని భ్రమసి పోయాను
గాంధీ, నెహ్రూ, పటేల్, బోసుల్లాంటి దేశనాయకులు పుట్టిన దేశమని మురిసి పోయాను.

ఝాన్సీ, రాణీ రుద్రమాది వీరనారీ మణులకు నిలయం మనదేశమని పులకించి పోయాను
సర్దార్ భగత్ సింగ్, రాజగురు, సుఖ్ దేవుల్లాంటి స్వాతంత్ర యోధులను కన్నదేశమని గర్వించాను.

ఎత్తైన కట్టడాల్లోకనిపించే నాగరికత నాదేననుకుంటూ సంబర పడిపోయాను
మూఢత్వాన్ని ఆశ్రయించుకున్న సంస్కృతిని తలచుకొని గర్వపడ్డ అమాయకుడ్ని నేను

రెండు రాజకీయ పార్టీల తగాదాతో నందన వనం లాంటి దేశం ముళ్ళకంపగా మారిపోయింది
మనదేశ సంపదకు చిహ్నంగా తిరుగుతున్న రైళ్ళను, బస్సులను తగులబెట్టే రౌడీలకు నిలయమైంది

ప్రభుత్వ భూముల్ని ఆక్రమించే వారికి, శ్మశానాన్ని స్వాహాచేసే వారికి లోటు లేదీ దేశంలో
దేవుని పేరు చెప్పి గుడుల్నీ గోపురాల్నీ మింగే తిమింగలాలకు నిలయం మనదేశం

వృద్ధ తల్లి దండ్రుల్ని వాళ్ళ కర్మానికి వదిలి నీతులు బోధించే వంచకులకు లోటు లేదిదేశంలో
అమాయకురాళ్ళైన పత్నులను తీర్థయాత్రలకు పంపి పడుచు వేశ్యలతై తారట్లాడే దగుల్బాజీలు గలదేశం

ఒప్పుకున్న కాంట్రాక్టుల్ని కాగితాలకొదిలి, దోచుకున్న సిమెంటుతో సౌధాలు నిర్మించే కాంట్రాక్టర్లకు నిలయం ఈదేశం
లంచాల గడ్డిని మెండుగా మేస్తూ అవినీతి ధోవతులను నిండుగా కప్పుకొనే పెత్తందార్లకు కొదవ లేదు

గుడిసెలను పీకి, మేడలను నిర్మించి, పేదవాళ్ళ ఉసురు పోసుకొనే ధర్మాత్ములకు నిలయం మనదేశం
దొంగనోట్ల పునాదులపై వెలిసిన ఆకాశ హర్మ్యాలలో విహరించే జమిందార్లున్నారు ఈదేశంలో

ఊరుకొక్క దొంగ బాబాను, గంగి గోవులా పెంచి పోషించే కుహనా భక్తులు గలదీ దేశం
మహాత్ముని పేరుతో మద్యశాలలు ముమ్మరంగా వెలసిన గొప్పదేశం మనది

అంటరాని తనం వద్దంటూనే "హరిజనులకు" ఊరవతల ఇళ్ళు కడుతున్న దేశం మనది
కులాల మీటర్లతో మానవత్వపు మైలు రాళ్ళను కొలుస్తున్న దేశం మనది

అధికారం కోసం అయిన వారినీ, చివరకు తాళికట్టిన భార్యను కూడా అమ్ముకొనే త్యాగధనులున్న దేశం మనది
హర్తాళ్ళు పేరుతో దేశసౌభాగ్యాన్నే భగ్గున మండించే శౌర్యవంతులు గలదేశం మనది

శ్రమైక జీవుణ్ణి పంచముడిగా మార్చిన వంచకులు మన మతప్రవక్తలు!
ఆ పంచముడు నడిబజార్లో చెప్పులూ, గొడుగూ వేసుకోడానికి వీల్లేదన్నారు మతాచార్యులు!

దినానికొక కన్నెను చెఱచిన జులాయిలు పెద్దమనుషులుగా చెలామణి అవుతున్నారు
ఆడపడుచులను బూతుల చెట్టులపై కెక్కించిన రౌడీ వస్తాదులు నేడు నీతులు వల్లిస్తున్నారు.

రైల్లో ఒంటరిగా వెళ్తున్న పడతిని రాక్షస రతిలో హింసించిన అన్నయ్యలకు తముడ్ని నేను
అయిదు రూపాయల కోసం ఆత్మబంధువును సైతం హత్య చేసిన వీరుడికి సోదరుణ్ణి నేను

ప్రజారక్షకభటుల కామానికి బలై, బావినీళ్ళలో తేలిన శవానికి చెందిన మందభాగ్యుణ్ణి నేను
తన పెళ్ళాన్ని పతివ్రతగా బెట్టుకుని ప్రక్కవాడి పెళ్ళానికి వల విసిరే కిరాతకునికి వారసుణ్ణినేను

శూద్రుడు వేదం చదివితే చెవిలో సీసం కరిగించి పోసిన కర్కోటకులు మన ఆచార్యులు

దేవాలయాల్లో సుఖవ్యాధులతో వీపులు గోక్కునే సోమరిపోతులు మనచరిత్రకారులట

ముళ్ళపందిలా చుట్టు పెంచుకుని హాయిగా తింటూ త్రేన్చే పరభాగ్యోపజీవులు స్వామీజీ లయిపోయారు
ఆ స్వామీజీలకు భక్తితో సాష్టాంగ పడే అమాయకుల తమ్ముళ్లో నేను

పగలు ఆంజనేయ స్వామికి అభిషేకం రాత్రి గుడిసెల్లో దూరే దొంగ భక్తులకు నిలయం మనదేశం
ఆస్తులకోసం భర్త శవంతో పాటే స్త్రీని సహగమనం చేయించే దుష్టసమాజంగలది దేశం

లక్షల కొలదీ నల్ల ధనానికి వారసులై తిరుపతి వెంకన్నకు భాగం పంచిపెట్టే ప్రభుద్దులు గలదీదేశం
అందుకే సిగ్గు పడుతున్నాను, ఈ దేశానికి వారసుణ్ణని చెప్పకోడానికి

యింటిలో టెలిఫోన్ పెట్టుకొని పలకరింపుగా పక్కవారింటికివెళ్ళి ఫోను వాడుకొనే స్వార్థపరులున్న దేశం మనది.
అవసరానికి ఫోను వాడుకొని బిల్లు వచ్చేక అమాయకుల్లా తెల్ల మొహం వేసేవాళ్ళు గలదేశం మనది.

# 38. ప్రభవ నామ సంవత్సర ఉగాది

ఇది ఉగాది రోజు - యుగానికే ఇది తొలి రోజు
తెలుగు వారికి ముచ్చటైన రోజు - పవిత్రమైన పండుగరోజు

తెలుగు హృదయాలలో - ఆనందం వెల్లవిరిసిన రోజు
కోటి వసంతాల - రసానందాన్ని త్రాగే రోజు

జరిగిన కాలంలో కలిగిన కీడును - ఒక పీడకలగా మరిచి పోండి
నిరుడు కన్న ఈ యేడు - కాసింత మెరుగవుతుందని ఆశించండి

ఎందరో కవులకు కళాకారులకు - కొలువయ్యింది మన పుణ్యభూమి
మరెందరో సంఘ సంస్కర్తలకు - సమర వీరులకు నిలయ మయ్యింది

సమాజ శ్రేయస్సుకు సత్యసందేశమిచ్చిన - తత్వవేత్త, సిద్ధపురుషుడు, అచలఋషియైన యోగి వేమన
నిష్కామ యోగంతో దేశసేవ సల్పిన - సత్యాగ్రహ సమరయోధుడు రాష్ట్రపిత అమరజీవి పొట్టి శ్రీరాములు

వితంతువుల సతంతువులుగా మార్చిన - సంఘ సంస్కర్త మనకందుకూరి
సమాజంలోని కుళ్ళు, కుట్రను, కూకటి వేళ్ళతో పెకలించిన మహాకవి గురజాడ

పరుల పెత్తనానికి, శిరసు వంచక, మర తుపాకి గుండ్లకు - గుండెనెదురొడ్డి నిల్చిన ఆంధ్రకేసరి టంగుటూరి
రవిఅస్త మించని సామ్రాజ్య వాదుల నెదుర్కొని - ముప్పు తిప్పలు పెట్టిన వీరుడు మన అల్లూరి

వీరంతా మన తెలుగు తల్లి గర్భ సుక్తి - ముక్తా ఫలాలు మన కాదర్శమూర్తులు
మన తెలుగు తోటలో అరవిరిసిన - ముద్ద మందారాలు

తెలుగు ప్రాంగణంలో వికసించిన - సుగంధ పరిమళాలు
తెలుగు కొమ్మకు పూసిన - రంగు రంగుల బంగారు పూలు

ఈ ప్రభవనామ సంవత్సర శుభారంభంలో - తెలుగు వారి ఎదలో వెలుగులు నింపాలనీ
ఆ శుభంకరుడు అనునిత్యం - ఆనంద సౌఖ్యాల్ని అందజేయాలనీ వేడుకొంటున్నాను.

# 39. టెలిఫోన్ - దాని ప్రగతి

కనిపెట్టాడు - జర్మనీ శాస్త్రవేత్త "గ్రహంబెల్" టెలిఫోన్‌ను 1876లో
ప్రదర్శించాడు - ప్రథమంగా దాన్ని అమెరికాలోని చిన్న యిరుకు గదిలో

అడుగుపెట్టింది - మన భారత గడ్డపై 1895 వ సంవత్సరంలో
దర్శన మిచ్చింది మొదలుగా మనబొంబాయి మహానగరంలో

పెరిగిపోయింది - ఈ నాటికది ఇంతింతై వటుడింతై అన్నట్లు
వ్యాపించింది - సర్వత్రా ఎందెందు చూచినా అందందే కలదన్నట్లు

కలిగించింది - జీవనోపాధి ఈ నాడు కొన్ని లక్షల మందికి
హత్తుకు పోయింది - నిత్యజీవితంలో ప్రతి ఒక్కరినీ

యింట్లో యిల్లాలు స్పృహతప్పి పడిపోతే - కావాలి టెలిఫోన్ డాక్టర్ను పిలవడానికి
అంగట్లో అగ్ని ప్రమాదం సంభవిస్తే - దాని అవసరం యింతని వీలుగాదు చెప్పడానికి

ఉండాలి టెలిఫోన్ తప్పని సరిగా - రైళ్ళను నడపడానికి రైల్వేవారికి
కావాలి అత్యవసరంగా - వ్యాపారస్తులకు వస్తువుల ధరల నిర్ణయించడానికి

పనిచేసింది ప్రథమ దశలో - ఈ టెలిఫోన్ రెండు తీగల మీదుగా
తీరిపోయింది తీగలతో - అవసరం ఒక దశాబ్దంగడవగా

కనుగొన్నాడు నిస్తంత్రీవిధానాన్ని - ఇటాలియన్ శాస్త్ర వేత్త "మార్కొని" 1889 లో
చేశారు నామకరణం - దీన్ని "మైక్రోవేవ్ లింకని" (రేడియో ఫోన్)

తొలగి పోయాయి - రాగి తీగలతో ఇబ్బందులు ఆనాటినుండి
కలిగింది బహుళ ప్రయోజనం - పోలీసు శాఖకూ, సైనిక సిబ్బందికీ

వేసింది మరో అడుగు ముందుకు - పనిచేయడంలో టెలిఫోన్
ప్రారంభించింది వార్తా ప్రసారం - కృత్రిమ ఉపగ్రహంద్వారా

సాగించింది వార్తాప్రసరణం - ఆకాశవాణి మాదిరిగ
దక్కింది దీనిఘనత - ఫ్రాంకో - జర్మన్ ఉపగ్రహం సింఫనీకి 1977లో

పోయింది మరో మెట్టు ముందుకు - మరికొంత కాలానికి అద్భుతంగా
పలికించింది టెలిఫోనును - అమెరికా బెల్ వ్యవస్థ కాంతి ద్వారా 1978 లో
పనిచేయించొచ్చు కాంతి ద్వారా - టెలిఫోన్లనే గాక పిక్చరు ఫోన్లను కూడా
ఉపయోగిస్తారు అందుకు గాజు నారను (గ్లాస్ఫైబరు) రాగి తీగలకు బదులుగా
పనిచేయించొచ్చు - ఒకేసారి 672 ఫోన్లను రెండు గాజు నార పోగుల ద్వారా
పనిచేయిస్తున్నా రిప్పుడు - అమెరికాలోని రెండు సంస్థల మధ్య దీన్ని విజయ వంతంగ
కుంచించుపోయింది - ఈ విశాల ప్రపంచం చిన్నదిగా ఈ టెలిఫోన్ రాకతో
యిరుక్కు పోయింది - ఈ జగమంతా పది అంకెలుగల చిన్న డైలులో ఈనాడు

అది సముద్రాల నవలీలగా దాటగలదు
కొండలు దానికి అడ్డు తగలవు
దూరంతో పనిలేదు
వేడీ చలువ దాని నంటవు
చీకటంటే భయం లేదు
వెలుతురంటే సంబరం లేదు
మన యింట్లో కూర్చొని సుఖంగా
ఏ దేశంలోని వారి తోనైనా సరాసరి
ఖులాసాగా సంభాషించవచ్చు
ఇటుపై మాటలేకాకుండా మాట్లాడే మనిషిని కూడా చూడొచ్చు
కొన్ని దేశాల్లో ప్రత్యేక నంబరు డైలు చేస్తే కమ్మని సంగీతం వినవచ్చు
ఇంకొన్ని దేశాల్లో కథలు కూడా వినవచ్చు
టెలిఫోన్ వుండటం ఒకప్పుడు ఒక ప్రత్యేకత
ఇప్పుడు అవి లేకపోతే పొద్దు గడవదు
అది జీవితంలో ఒక భాగం అయిపోయింది.

# 40. పట్ట పగలు చీకటి కాటేసిన రోజు

అది అక్టోబరు ముప్పయి ఒకటవ రోజు!
పట్టపగలు కటిక చీకటి అలము కొన్న రోజు!

విడిచి వికసించిన పూలు- మాడి మసైపోయిన రోజు
కోటాను కోట్ల జనవాహిని గుండెల్లో - దుఃఖం పొంగి పొరలినరోజు

జలపాతాలన్నీ నిశ్చేష్టితాలై - ఇందిరా శిఖరాగ్రాన్ని కన్నీటి పుష్పాలతో అభిషేకించిన రోజు!
కాంతి దీపాలు వెలిగించిన చేతినే - కసికసిగా కాటేసిన రోజు!

చీకటి బ్రతుకుల్లో - మానవతా జ్యోతులు వెలిగించిన అమృతమూర్తి!
హరిజనుల పాలిట ఆశాజ్యోతి - గిరిజనుల పాలిట భాగ్యరాశి

అతిరధ మహారధుల్లాంటి! మగధీరుల నాట కట్టించి గద్దెనెక్కిన వీరనారీ శిరోమణి!
మొక్కవోని, ఆమె ధైర్య సాహసాలు, అప్రతి మానం! అనన్యం సామాన్యం!

దేశ దేశాల చరిత్ర పుటల్లో చెరిగి పోని యశస్సు నార్జించిన బహుముఖ ప్రజ్ఞాశాలి!

స్వదేశ పౌరుల నీతి బాహ్యానికి అతి క్రూరంగా బలైపోయిన నిస్సహాయిని!

మందిర ప్రాంగణంలో మైమరచి విహరించే ప్రశాంత వేళ తుపాకుల భీకర భయంకర నాదాలు - ఒక్కుమ్మడిగా వికటాట్టహాసం చేశాయి.

శాంతిపావురం, పశుత్వం చేతిలో పడి గిలగిల కొట్టుకుంది!
దీవాతి దినంగా కుప్పకూలి - రక్తంతో నేల తడిసి పోయింది.

అఖండ భారతావనికే ఆశాజ్యోతి యైన ఇందిరమ్మ మనకికలేదు
నీవు లేవు తల్లీ! నీవేసిన బాట వుంది, నీవు లేవు అమ్మా! నీ సందేశం వినిపిస్తుంది.

నీ అడుగడుగూ, నీ ప్రతి పలుకూ, భారతజాతి హృదయాల్లో గూడుకట్టుకొని వున్నాయి
నీ చిత్రం, నీ చరితం, నీ భాష్యం! నిత్యం, జ్ఞాపకాలే!

పేదల పాలిటి పెన్నిధిగా, దీనుల పాలిట దేవతగా భాసించిన తల్లివి అసంపూర్ణ చిత్రాల్ని పూర్తి చేయకుండా అఖండ భారత జనాన్ని ఏకాకిని చేసి అమర లోకాని కరుదెంచావు.

తల్లి లేనిపిల్లల్లా సమస్త భారతం తల్లడిల్లి పోయింది!
అమ్మా! విజయేందిరా! అందుకో వమ్మ మా కవి తాశ్రుతర్పణం!

# 41. నాకు కవిత వ్రాయాలని ఉంది

నాకు కవిత వ్రాయాలని వుంది
రాబోయే తరం కోసం పెరుగు తున్న యువత కోసం

మనిషిలో మానవత పెంపొందాలని
జనతలో మమత ఏవుగా పెరగాలని
సంఘంలో సమత పెంచి పోషించాలని

నాకు కవిత వ్రాయాలని వుంది
రాబోయే తరం కోసం పెరుగుతున్న యువతకోసం

స్వార్థంతో పెంచిన పందిళ్ళను పెరికి వేయాలని
పేదల స్వప్నాలు నిజమయ్యేట్లు దేశాన్ని తీర్చి దిద్దాలని
చీకటి బజార్లు నడిపే చిల్లర దేవుళ్ల ఆట కట్టించాలని.

నాకు కవిత వ్రాయాలని వుంది
భావితరాలకు మార్గం చూపాలని వుంది

కుత్సిత రాజకీయాలను కూకటి వేళ్ళతో పెకలించి వేయాలని
ప్రజలను మాయజేసి పబ్బం గడుపుకొనే వినాయకుల భరతం పట్టాలని
దేవదూతలమంటూ దొంగ వేషాలేసే దుండగుల రోగం కుదర్చాలని

నాకు కవిత వ్రాయాలని వుంది
భావి తరాలకు మార్గం చూపాలని వుంది

అంధకారంలో కొట్టు మిట్టాడే నాజాతిని మేల్కొల్పడానికి
ఒంటరి వనితలను హింసించే తుంటరిగాళ్ళకు బుద్ధి చెప్పాలని
సంఘానికి చీడ పురుగుల్లా దాపురించిన దుగుల్బాజీలను తగుల బెట్టాలని

నాకు కవిత వ్రాయాలని వుంది
రాబోయే తరానికి వెలుగు చూపించాలని వుంది.

# 42. ప్రకృతి - ప్రతిబింబం

బోసినవ్వుల పసిపాపల్ని పరికించినప్పుడు
బిడ్డను గుండెకు హత్తుకొని మురియుచున్న తల్లిని చూసినప్పుడు
ఎదలో ఆవేశం పొంగి పొరలు తుంది
అది కవితగా రూపొందుతుంది.

వయసు కన్నెలు సిగ్గుతో మొగ్గ వేస్తున్నప్పుడు
నవ వధువులు తమ వరులకోసం మరులుగొన్నప్పుడు
ఏదో తెలియని ఆనందం మెదడులో మెరుస్తుంది
అది కవనంగా మారి కవి గొంతునుంచి వినిపిస్తుంది.

ఉషోదయపు అరుణకాంతుల్ని తిలకించినప్పుడు
మంచు బిందువులు, రవికిరణాలతో వెలుగు తున్నప్పుడు
హృదయంలో ఆవేశం పొంగుతుంది
అది ఒక తీయని కవితగా మారుతుంది.

పిల్లల యెడ తల్లుల మమకారం చూసినప్పుడు
వసంతంలో ప్రకృతి వలువలు ధరించి నప్పుడు
ఏదో తెలియని అనుభూతి కలుగుతుంది
అప్పుడు అవ్యక్తమగు ఆనందం పెల్లుబుకుతుంది

పక్షుల కిలకిలా రావములు వీనులకు సోకినప్పుడు
కొలను లోని కలువ కన్నెలు రేకులు విప్పుకుంటున్నప్పుడు
ఏదో చెప్పరాని ఆనందం మనసులో ఆవహిస్తుంది
అది కవితగా మెరిసి జాలువారుతుంది.

ఆమని ఏతెంచి కోయిలలు గొంతెత్తి పాడుతున్నప్పుడు
శరద్రాత్రులందు వెన్నెలలో స్నానమాడి నప్పుడు
ఎదలో తీయని భావం మొలకెత్తు తుంది
అది ఒక మధురమైన కవితగా రూపొందుతుంది.

చల్లని మలయ మారుతం మేను స్పృశించినప్పుడు
వేణుగానం వీనులవిందు చేసినప్పుడు
మనసు ఉల్లాసంతో ఊగిసలాడుతుంది
అది ఒక అపూర్వ కృతిగా రూపు దిద్దు కుంటుంది.

# 43. నర్సులు

మీ అనురాగాలు- రోగులకే అంకితం
మీ అనుభవాలు- రోగాలకే అర్పితం

మీ జీవితాలు- సేవలకే పరిమితం
మీ సేవల్లో- అమృతత్వముంది

మీ ఒర్మిలో- కూర్మి వుంది
మీ లాలనలో - లాలిత్యముంది

మీ ఆకారంలో - స్వచ్ఛత వుంది
మీ నడతలో - నిర్మలత్వముంది

మీ మనసులు - మల్లెల్లా తెల్లనివి
మీ చూపులు - మంచులా చల్లనివి

మీరు అందరికీ - ఆడపడుచులు
తోడ బుట్టని - చెల్లాయిలు

రోగుల పాలిటనె - ఆత్మ బంధువులు
బాధలు పోగొట్టే - దేవదూతలు

మీ సేవల్లో - పక్షపాతం మచ్చుకైనా లేదు.
మీ ఆలోచనల్లో - రాజకీయం అసలే లేదు.

మీ భావనలో - సమానత్వం, సమభావన లున్నాయి
మీ హృదయాల్లో - సమతా మమతలు నిండి వున్నాయి

మీ చికిత్సలో - తరతమ భేదాల్లేవు
మీ ఆదరణలో - అశ్వనీదేవతలు తొంగి చూస్తారు

సమ భావం సమానత్వం - మీ సొత్తు
అందరిని ఒకేలా చూసే - ఉదారగుణం మీలో వుంది.

మచ్చ లేని - తెల్ల గులాబీలు మీరు
మలినం లేని - మానవాత్మలు మీరు.

# 44. సంసార యజ్ఞం సాగించండి

సాంసార యజ్ఞాన్ని నిర్వహించడానికి సమాయత్తం కండి
మీరు వేసే ప్రతి సమిధనూ తూచి తూచి వేయండి

మీరు చేసే యజ్ఞం పవిత్రంగాను, స్వచ్ఛంగాను వుండాలి
యిరువురి మాటా ఒకటై వుండాలి. ఊహలు ఒకటిగా వుండాలి

యజ్ఞం నిర్విఘ్నంగా సాగాలంటే ఒకరిపై ఒకరికి విశ్వాస ముండాలి
మీధ్యేయ మొక్కటే అయి వుండాలి మీ ధ్యాన ఒకటిగా వుండాలి

అనురాగపు టంచులను అందుకొండి
వలపు పంటను పండించు కొండి

నిన్నటి వరకూ మీరు ఎవరెవరో ఎక్కడెక్కడో వున్నారు
నేడిరువురూ ఒకచోట ఒక్కరవు తున్నారు

ఇక మీరిరువురూ ఒకటిగా నడవాలి
ఒకరి మాట నొకరు గౌరవించుకోవాలి

ఒకరి సుఖానికై మరొకరు పరితపించాలి
కలిసి సంసార నౌకను నడిపించాలి

మంచి పౌరులను దేశానికందించాలి
పరిమిత సంతానాన్ని పొంది, అపరిమిత ఆనందాన్ని పొందాలి

నిన్నటి వరకూ మీరు వేరు వేరు, నేడు మీరు ఒకరికొకరు
కలిసి జీవించండి - జీవితాన్ని పండించుకోండి

సంసార సాగర మధనం సాగించండి
ఆనందామృతాన్ని - ఆస్వాదించండి

ప్రతిరేయి ప్రథమ రేయిగా గడపండి
ప్రతిరోజూ ప్రేమ నౌకలో పయనించండి

మీ ఊహలకు ఒక అర్థం - మీ కలయికకు ఒక పరమార్థం ఉండాలి
మీ యవ్వన సామ్రాజ్యానికి - మీరే రాజదంపతులు.

## 45. (చి॥సౌ॥ సబితకు) జన్మదిన శుభాకాంక్షలు

శ్రీ కొప్పన వారింట - ఉదయించినావు
ముద్దు మురిపాలతో - పెద్దవైనావు
చదువులు, సంధ్యలూ - జహూనేర్చినావు
జీవితపు మర్మాలు - తెలుసుకున్నావు

అపరంజి బొమ్మలా - అవధరించావు
చక్కనీ చేమంతి - పూవువైనావు
శ్రీ కోమర్తి వారింటి - కోడలైనావు
హనుమ విరిల్లగోత్ర - నామ ధారిణి వైనావు

నారసింహమూర్తిని. - పరిణయమాడినావు
మా వంశాన్నుద్ధరించ - తరలి వచ్చావు
మా యింటి వెలుగువు నీవు - మా కంటి జ్యోతివి నీవు
మా ఉత్తరాధికారివి నీవు - ఉత్తమ ఇల్లాలిగ పేరు తెచ్చుకో నీవు

నీవు కావాలి మాకు - చల్లని వెన్నెల పందిరి
నీ నడత కావాలి - యిరు వైపులా కీర్తి సిరి
మా కడుపున పుట్టకనే - కూతురైనావు
మమ్ము కనకుండనే - మాకు తల్లివైనావు

నీ దాంపత్య జీవితం కావాలి - ఒక అందాల బృందావనం
నీ సంసార జీవనం కావాలి - ఒక సుమధుర సుందరస్వప్నం
సకల సద్గుణాల పెన్నిధి - సహధర్మచారి నీ పెనిమిటి
ఆనంద 'మూర్తి' యే నీ అండనుండ - లేదమ్మ నీకు ఎలాంటిబెంగ

ఆడంబరాల జోలికి పోకు - శక్తిని మించి నడచుకోబోకు
చుట్ట పక్కాల నాదరించు - గుట్టు విషయాలు మనసున పట్టివుంచు
వంశాంకు రాన్ని ప్రసాదించు - మా వంశవృక్షాన్ని పెంపొందించు
అందాల మనుమడ్ని అందించు - ఈ పెద్దవారి ముద్దు ముచ్చట్లు తీర్చు

మహత్తుగల ఉమామహేశ్వరులు - అయ్యారు మన యిలవేలుపులు
ముప్పొద్దులా వార్ని పూజించుకో - ముచ్చటైన వరాన్ని అందుకో

నీవు పుట్టిన రోజు పండగను - నవ్వుతూ, నవ్విస్తూ
నూరు వసంతాలు - నిర్విఘ్నంగా జరుపుకోవాలని

ఆ పరమశివుని పదే పదే వేడుకొంటున్నాను.

# 46. 'విభవ' నామ సంవత్సర 'ఉగాది'

ఇది ఉగాది - నవచైతన్యానికి, నవనీతకు, ఇది నాంది
ఇది తెలుగు సంవత్సరాది- నవ జీవనానికిది వేసింది పునాది

వేప పువ్వులోని చేదు తనం - మామిడి పిందెలోని వగరు తనం
కొత్త బెల్లంలోని తీయదనం - చింతపండులోని పుల్లదనం

అన్నీ కలిసి ఉగాది పచ్చడయ్యింది - జీవితాన్ని హెచ్చరించే పండగయ్యింది
తెలుగు వారి కెల్లరకూ ఆనందం పంచి యిచ్చే - పర్వదిన మయ్యింది

యుగయుగాల తెలుగు చరిత్రకు - మనమంతా వారసులం
తరతరాల జాతి వికాసానికి - మనమంతా నిదర్శకులం

ప్రగతికి ప్రతి రూపం ఆంధ్రదేశం - సుగతికి సుక్షేత్రం ఆంధ్రభూమి
మేడి పట్టి దున్ని మేదినిలో - మేరువు పండించు కర్షక మేధావులు మన తెలుగువారు

కాకతీయుల కదన పాండిత్యం - జీర్ణించుకొన్నది మన తెలుగుజాతి
కదనరంగంలో పదును కత్తుల పాటవం చూపి - పరాయిజాతుల గుండెలను
పగుల గొట్టు వీర శూర శిఖామణులు మన తెలుగువారు

తెలుగు పౌరుషఖ్యాతి కేతనా కాంతులు - పాటలీపుత్ర పర్యంతం వ్యాపింపజేసినారు మన తెలుగు వారు
పర్వత గుహాం తర్భాగాల పేరు కొన్నతిమిరాన - కరగ బెట్టు శిల్పకాంతు ులందించిన హస్త శిల్పకళా నిపుణులు మన తెలుగువారు

తెలుగు వెలుగు బావుటా కాంతులను - పరదేశ సీమల పర్యంతం ప్రతిఫలింపజేసిన ప్రతిభా సంపన్నులు మన తెలుగువారు
కళాసాహిత్యరంగంలో కనకాభిషేకం చేయించుకున్న కవి, పండిత, గాయక, నాట్య నిష్ణాతులు తెలుగువారు

అమరావతీ, నాగార్జున శిల్పతల్పాలను - నును మెత్తని పూలపాన్పులుగా అమర్చి కీర్తి నార్జించినారు తెలుగువారు
ఏడు గజాల చీరను - అగ్గిపెట్టెలో నిమడ్చగల అఖండ చేనేత వస్త్ర కుశలురు మనతెలుగువారు

ఓడల మేడలను రత్నాలతో పొదిగి - 'ఓహో' అని పించుకొన్నారు మన తెలుగువారు
ప్రజల నౌకా వ్యాపార విహార యాత్ర మహోత్సవమును - దేశదేశాల జనులకు నేత్రానంద కరంగా చూపించినారు మన తెలుగువారు

మలయా, కంబోడియా, జావా ద్వీపాలలో - ఆనాడు వెలిగించిన సాంస్కృతీ దీపాల కాంతులు
ఈ నాటికీ చెక్కు చెదరక అఖండ జ్యోతులుగా వెలుగొందు తూనే వున్నాయి.

వృక్షఛాయలలో అక్షయ జ్ఞాన బోధామృత మందించు - అలౌకిక జ్ఞాన సంపన్నులు తెలుగువారు

నాటికీ, నేటికీ, ఏనాటికీ తెలుగు దేశ చరిత్రకు లేదు పూర్ణ విరామం, అది కోరదు ఎన్నడూ ఆరామం

ఈ విభవ నామ సంవత్సరం తెలుగు వారి జీవన విధానాన్ని వైభోవపేతంగా తీర్చి దిద్దాలనీ
సర్వ సాక్షియైన ఆ సర్వేశ్వరుని - మనసారా వేడుకుంటున్నాను.

# 47. మాట

మాట, ఇద్దరు వ్యక్తుల మధ్య - నిశ్శబ్దాన్ని చీలుస్తుంది
మాట, మనిషిలో అజ్ఞాతంగా వుండే - మాన వత్వాన్ని వెలిగిస్తుంది

మాట ల్లేని అడవిలో క్రూరమృగాలు - రాజ్యం చేస్తూ వుంటాయి
మాటల పంటలు పండని చోట - యుద్ధ జ్వాలలు చెలరేగుతూ వుంటాయి

మాట అగ్గి పుల్లలా - భగ్గున మండిస్తుంది
మాట పన్నీరు వర్షించే మేఘ ఘర్జన కావచ్చు

మాట స్నేహితుడో, ప్రియుడో - వెదజల్లే అనురాగం కావచ్చు
చీకటిలో విన్పించే- చిరుగాలి సవ్వడి కావచ్చు

మాట, అకస్మాత్తుగా పగిలే - అగ్ని పర్వతంకావచ్చు
పర్వతాన్ని పడదోసే - భూకంపం కావచ్చు

సైకిల్ పై యింటికి చేరే - ప్రేమ లేఖ కావచ్చు
తోటలోంచి ఎగిరొచ్చే - మల్లెపువ్వు కావచ్చు

నేల క్రింద భూమి చీలినప్పుడు - మాటలు పడిపోతాయి
నేల చీలి పాతాళగంగ పెల్లుబికినప్పుడు - మాటలు తడబడతాయి

ఆనందం ఆపుకోలేనప్పుడు - కళ్ళే మాట లౌతాయి
మాట మాత్రమే మనిషిని - మనిషి చేస్తుంది

మాట ఏ భాషైనా కావచ్చు - దానికున్న విలువ దాని కుంటుంది
నోరు మంచి దైన ఎక్కడి కెళ్ళినా - వూరు మందే నని నానుడి

మాటలే మంత్రాలవుతాయి - అవి విషానికే విరుగడవుతాయి
మాటయే ఒకపరి వరమౌతుంది - ఆ మాటయే మరోసారి శాపమౌతుంది

మాటలలోనే యిమిడి వుంటుంది - మంచి కవిత్వం
మాటలతో కూడి యున్నదే - చక్కని గీతం

మాటల మంచి తనంలో - జగాన్నే మచ్చిక చేసుకోవచ్చు
మాటతోనే మనిషి తన అంతరంగాన్ని - విప్పి చెప్ప వచ్చు

ఒక చక్కని మాట మాత్రమే - మంచి మిత్రుడ్ని ప్రసాదిస్తుంది
ఒక చల్లని మాట మాత్రమే - నిజమైన మనశ్శాంతి నిస్తుంది.

# 48. ఇంజనీర్ల అసంతృప్తి

ఉద్యమాలు ఎందుకుపుడతాయి? - విప్లవాలు ఎందుకు తలెత్తుతాయి?
అయినవాళ్ళకు ఆకుల్లోను, కానివారికి - కంచాల్లోను వడ్డిస్తున్నందుకు?
సమస్యల పట్ల సామరస్యం, సమర్థతపట్ల - సదవగాహన కొఱవడినందుకు.

సాంకేతికాధికారుల ప్రజ్ఞా పాటవాలు - గుర్తింప బడుట లేదు
వారి దీక్షాదక్షతలు, భక్తి విశ్వాసాలు - శంకించ బడుతున్నాయి
సాంకేతిక సిబ్బంది వేతన నిర్ణయానికొస్తే తీరని అన్యాయమే
జరిగింది

రేయనక పొద్దనక ఒద్దికగా - చేయాలి చాకిరీ ఇంజనీర్లు
రేపటి భవిష్యత్ భవనాలకు - వేయాలి పునాదిరాళ్ళు ఇంజనీర్లు
పనిలో కాలనియమం లేకుండా - చేయాలి, వెట్టిచాకిరీ వెఱ్ఱి
బాగుల వాళ్ళు

బానిసలకన్న బాగుకావులే - ఈ సాంకేతికాధికార్ల బ్రతుకులు
క్లాస్ ఫోర్లకంటె క్లాసయినవి కావులే - ఈ నికృష్టపు జీవితాలు
పేరుకు మాత్రం గెజిటెడ్ ఆఫీసర్లు - తినాలి ఫస్టుక్లాసులో చీవాట్లు

ఇంజనీర్లంటే మెరిసే చెమట బిందువులు - రక్తాన్ని చిందించే శ్రమైక
జీవులు
బాధ్యతల భారాన్ని అనునిత్యం - శిరముపై మోస్తున్న కృషీ వలులు
ఆదాయాన్ని తేవడానికి అహర్నిశలు - ఆరోగ్యా ల్నరగ దీస్తున్న త్యాగధనులు

నిజానికీ ప్రగతి వెనుక నున్న హస్తా లెవరివి? - ఈ క్రాంతి
వెనుకనున్న దివిటీ లెవరివి?
చేతులే పాఱలై కాళ్ళే గునపాలై - దినమంతా దుమ్మూ ధూళిలో
శ్రమించే యింజనీర్లవి కావా?
చెఱువులో నీరు పుష్కలంగా వుందంటే - పిల్లకాల్వల శ్రమ
లేదంటారా?

ఒకే ఉద్యోగానికి రెండు రకాల జీతాలట! - ఒకే హోదాగల ఇద్దరిలో
హెచ్చు తగ్గువేతనాలట?
జాబులో చేరి పుష్కరాలు గడుస్తున్నా - ప్రమోషన్లు గగన కుసుమాలేనట!
ఏమిటీ విడ్డూరం? ఎంతకాలమీ నిరీక్షణ ? - ఆఫీసర్ల గుండెలు అసంతృ
ప్తితో మండవా?

అర్జీల వర్షం ఎంత కురిపించినా - అధికార బధిరులకు వినిపించుట కల్ల
నిస్పృహతో మండే గుండెలు - అగ్ని పుష్పాలై విచ్చుకోవాలి
శ్రమతో నలిగిన నరాలు - కాలిన తీగల్లా సాగాలి

మేఘాలు ఘర్జిస్తేనే - కురుస్తుంది వర్షం
మందు పెడితేనే - పుండు మానుతుంది
హాలా హలం పుట్టేకే - అమృతం పుడుతుంది.

# 49. ప్రేమ - కామం

మనుషుల్లో దివ్యప్రవృత్తే - 'ప్రేమ' మనుషుల్లో జంతుప్రవృత్తే - కామం

ప్రేమ ఎదుటి వ్యక్తి సుఖాన్ని - కోరుకుంటుంది
కామం ఎప్పుడూ స్వార్థాన్నే - కోరుకుంటుంది

ప్రేమ ఎదుటి వ్యక్తి శ్రేయస్సును - మరచిపోదు
కామం ఎదుటి వ్యక్తి ద్వారా - తృప్తిని వాంఛిస్తుంది

ప్రేమ ఎదుటి వ్యక్తి సుఖం కోసం - త్యాగం చేస్తుంది
కామం స్వార్థంతో ఎదుటి వ్యక్తిని - కబళించి వేస్తుంది

ప్రేమ బలాన్ని చే కూర్చేలా - చేస్తుంది
కామం మనుషులను క్షీణించి - పోయేలా చేస్తుంది

ప్రేమలో మేధ, హృదయం, ఇంద్రియాలు కూడ - పనిచేస్తాయి
కామంలో మేధ, హృదయం, - నిద్రాణమై వుంటాయి

ప్రేమతో కూడిన శరీరం - తీయదనం, ఆనందం అనుభవిస్తుంది
కామంతో కూడిన శరీరం - చేదుతనం, విచారం, ఆందోళన అనుభవిస్తుంది

ప్రేమ దేహాన్ని దాటి ఆత్మ యందు - ప్రవేశిస్తుంది
కామం దేహాన్ని దాటి పోక - ఇంద్రియాలయందే రమిస్తుంది

ప్రేమ సుఖాలతో పాటు కష్టాలను, దుఃఖాలను - పంచుకుంటుంది
కామం సుఖాలనే గాని కష్టాలను భరించలేదు

ప్రేమ స్వతంత్రంతో ప్రవర్తించి ఎదుటి వ్యక్తి స్వాతంత్ర్యాన్ని మన్నిస్తుంది
కామం, నిరంకుశంగా ప్రవర్తించి, దుడుకు తనాన్ని ప్రదర్శిస్తుంది

ప్రేమ మర్యాదగా, సభ్యతగా పెద్ద మనిషిగా నడుచుకుంటుంది
కామం అమర్యాదగా, అసభ్యతగా, దుష్టునిలా ప్రవర్తిస్తుంది

ప్రేమ తన్ను ఇతరులు గుర్తిస్తారని భయపడదు
కామం తాను ఇతరుల కంట బడకుండా తప్పించుకుంటుంది

ప్రేమ స్వచ్ఛంగా వుంటూ - వెర్రి వేషాలేయదు
కామం కన్ను గప్పేందుకు - ఎన్నో నటనలు చేస్తుంది

ప్రేమకు ఎన్నడూ అసూయ వుండదు, శంకవుండదు
కామానికి అసూయ మెండు, నిత్యమూ శంకిస్తుంటుంది

ప్రేమ నలుగురిలో నిర్భయంగా కళ్ళు విప్పి చూస్తుంది
కామం నలుగురిలో తిరగడానికే కళ్ళు మూసు కుంటుంది

ప్రేమ, పాలు నీళ్ళను ఇముడ్చు కున్నట్లు కామాన్ని తనలో ఇముడ్చుకుంటుంది
కామం, నూనె నీళ్ళ మాదిరి ప్రేమను తనలో ఇముడ్చు కోలేదు.

ప్రేమ మానవులను దివ్యులతో సమానం. చేస్తుంది
కామం మనుషుల్ని జంతువులతో సమానం చేస్తుంది.

# 50. పెళ్ళి

వివాహాలు స్వర్గంలో - నిశ్చయ మవుతాయి
అవి భూమిపై - సమాప్త మవుతాయి
అన్ని వినోదాలు వివాహంతో - అంత మవుతాయి
అన్ని విషాదాలు మరణంతో - ముగుస్తాయి

వివాహం ఆనంద దాయక మనేది- ఒక భ్రాంతి
జీవితం వర్ధించిన విస్తరనేది- అదొక అతిశయోక్తి
పెళ్ళి, మొదట మోచేతి మీద - దెబ్బ లాంటిది
అది క్రమేపీ అణగారిన - బాధ లాంటిది

తెలివితో తిడుతున్న ఆడదాన్ని - పెళ్ళి చేసుకో వద్దు
తెలివిలేని శాంతమూర్తిని - వదులుకోవద్దు
నీ హోదాను మించిన దాన్ని - పెళ్ళాడబోకు
నీకు సమీపంగా ఉండే స్త్రీని - పోగొట్టుకోకు

పెళ్ళి చేసుకొన్నప్పుడు - కొంత పతనం చెందుతావు
మంచి మిత్రుని ఎన్ను కున్నప్పుడు - ఉన్నత స్థితిని పొందుతావు
పెళ్ళి, పెళ్ళి అనడంలో - కొంత ఆనందం కలుగుతుంది
కానీ అది అనుభవించే టప్పుడు - అంత రుచికరంగా వుండదు

బలవంతపు పెళ్ళి - నరకం, నిరంతరం నీకు వ్యధ
తగని వారిని పెళ్ళాట్టం - ముళ్ళ కిరీటాన్ని పెట్టుకోవటం
పెళ్ళితో మగవాడి స్వేచ్ఛ - అంతమైపోతుంది
దానితో ఆడవారి స్వేచ్ఛ - ప్రారంభమవుతుంది

ఒకసారి పెళ్ళాడటం - తప్పనిసరి
రెండు సార్లు తెలివి తక్కువ - మూాడుసార్లు పిచ్చి
నీకంటే తక్కువైన దాన్ని - పెళ్ళి చేసుకో
నీకంటే ఉన్నతుడైన వానికి - నీకూతుర్నివ్వకు

తల్లి గుణాన్ని చూచి - తనయను పెళ్ళాడు
దాంపత్యంలో సుఖాన్ని - ఇచ్చి పుచ్చుకో

వివాహం ఒక విచిత్ర వ్యవస్థ - దానికి లోనైన వారు బైట పడాలని చూస్తారు

ఆ వ్యవస్థకు బైటనున్నవారు - లోనికి రావాలని చూస్తారు

పెళ్ళికి ముందు కళ్ళు బాగా - తెరచి యుంచు
పెళ్ళయిన తర్వాత కళ్ళు సగం - తెరచి యుంచు

రహస్యంగా పెళ్ళాడితే - బహిరంగంగా అవమానిస్తారు

పెళ్ళాట్టానికి ముందు - వుండేందుకు చోటు చూసుకో

అనుకూలంగా లేని దాంపత్యం - "ఉరి" కన్నా బాధాకరం,
తెలివిగా పెళ్ళాడాలంటే - సమానుర్ని పెళ్ళాడు

పుంజు కంటే పెట్ట ఎక్కువగా కూసే యిల్లు - విచారంగా వుంటుంది

గర్వంతో బ్రహ్మ చర్యం కన్నా - వినయంతోడి దాంపత్యం ఉన్నతం

స్నేహితుని ఎన్నుకొనే టప్పుడు - ఓ మెట్టు పై కెక్కాలి
వధువుని ఎన్నుకొనేటప్పుడు - ఓ మెట్టు క్రిందికి దిగాలి

పెళ్ళాడినరోజే అభివృద్ధో, పతనమో - ఆరంభమవుతుంది.

# 51. మహిమాన్విత - మహిళ

సామాన్య స్త్రీలకే - ప్రేమంటే తెలుస్తుంది
అందమైన స్త్రీల జీవితం - ఆకర్షణల మధ్య గడుస్తుంది

వయసు మళ్ళిన భార్య, చిరకాలపు కుక్క - విశ్వాసంగల మిత్రులు
భగవంతుని తర్వాత మనం - ఋణ పడేది ఒక్క స్త్రీకే!

మనకు జన్మనిచ్చేది - ఆ జన్మను సుఖమయం చేసేదీ స్త్రీయే!
స్త్రీ భయ పడినంతవరకే - మగవాడి ధైర్యం!

మహిళలు పూజింపబడే చోట - దేవతలు నివసిస్తారు
ఒక పురుషుడిని సజ్జనుడిగా, పెద్ద మనిషిగా - తీర్చిదిద్దేది, మహిళే!

భక్తిలేని దానం, దక్షిణ లేని యజ్ఞం, వ్యర్థం
పిల్లలు లేని స్త్రీ ఎంత అందగత్తయినా- ఆమె జీవితం వ్యర్థం

చేస్తున్నా పోట్లాడేది కుమారుడు - పోట్లాడుతున్నా చేసేది తల్లి
పెట్టినా వి మర్శించేవాడు బిడ్డ - విమర్శించినా పెట్టేది తల్లి

ఇంటిలో వసంతమనేది - స్త్రీ సామర్థ్యంపై వుండే నమ్మకంపై వుంటుంది
కోకిలకు గాత్రం, స్త్రీలకు పాతి వ్రత్యం - అలంకారాలు

తల్లిపాలలో ఒక కుటుంబ కథ - ఒక జాతి కథ వుంటుంది
స్త్రీ ఆలోచనలో నడవడిలో - ఆమె హృదయం కనిపిస్తుంది

ఓ స్త్రీని విద్యావతిని చేస్తే - ఒక కుటుంబమంతా విద్యా వంత మవుతుంది
చాలా మంది స్త్రీలకు విద్య గరిపితే - ఓ జాతే విద్యా వంతమవుతుంది

తల్లి తన పిల్లల అభివృద్ధిని - చూడవచ్చు, లేక పోవచ్చు
కాని వాళ్ళ అభివృద్ధికి పునాదులు - వేసేది మాత్రం అమ్మే

పురాణ కథలన్నింటి లోనూ పురుషులకన్న తెలివైనదీ - సమయస్ఫూర్తి
ఉన్నదీ ఒక్క ద్రౌపదికే!
స్త్రీ స్థితి గతులను చక్క బరచనిచో మన శ్రేయస్సు ఫలించదు

కుటుంబ నియంత్రణ విధానానికి మార్గదర్శకురాలు మార్గరెట్
ఆమె తన తల్లి కన్న సంతానంలో - పదకొండు మందిలో ఒకతె

స్త్రీ పురుషు లిద్దరూ నరజాతికి - చెందిన వాళ్ళే
ఐనా వాళ్ళ మనస్తత్వాల్లో - విపరీత భేదాలున్నాయి

స్త్రీ పూవులాంటిది - కాయలు కాస్తుంది
నేలలాంటిది - సంతానాన్ని కంటుంది

స్త్రీ పురుషునికి అన్ని విధాలా - సహకరిస్తుంది
అతని జీవితంలో కష్ట సుఖాల్నీ - పంచుకుంటుంది

స్త్రీలకున్న ఓ విధమైన ప్రజ్ఞతో - నిజాన్ని యిట్టే పసిగడుతుంది
స్త్రీ ఓ భావమయి - అందుకే కనికరం, సానుభూతి, రాగద్వేషాలు మెండు

స్త్రీ ప్రాణి కోటిని - ఉత్పత్తి చేస్తుంది
భగవంతునితో - సహకరిస్తుంది

దేవుడు భూమిపై నిలిపిన ప్రాణశక్తిని - అవిచ్ఛిన్నంగా కొనసాగిస్తుంది
ఆమె రూపం, లలిత లలితంగా యింపుగా వుంటుంది

ఆమె పిల్లలను ప్రేమ దృష్టితో చూస్తూ - సానుభూతితో పెంచి పెద్దచేస్తుంది
స్త్రీ శారీరక సుఖం కంటె, మానసిక సుఖం - కోరుకుంటుంది

స్త్రీకి వస్తువులకంటే మనుష్యులమీద మక్కువ ఎక్కువ
అందుకే ఆడవాళ్ళు తమ్ము గూర్చి, తమ పిల్లల గూర్చి, యిరుగు పొరుగు వారి గూర్చి, తరచు చెబుతారు.

ఆడవాళ్ళు వస్తువుల అందాల్ని ఎన్నుకుంటారు, పదిమందినీ ఆకర్షించాలని - కోరుకుంటారు.
మతవిషయాల మీద, భగవదారాధన మీద అభిమానం ఎక్కువ.

భగవంతునిపై దృష్టిని నిలిపి ఆ అనంతంవైపు నడిచి పోగలుగుతుంది
ఆమెకు ప్రేమ వాంఛ మెండు - ఇతరులు తన్ను మెచ్చుకోవాలని కోరుకుంటుంది

ఇతరులు తనపట్ల ప్రియంగ మెలగ కుంటే - ఒంటరితనాన్ని ఎంచుకొని బాధపడుతుంది
ఆడది, ఒంటరి తనాన్ని భరించే కన్నా - మృత్యువునే కోరుకుంటుంది.

# 52. తేనెలొలుకు తెలుగు భాష

మాట్లాడు నపుడు, ఒక సంగీత మేదోలా విన్పించు భాష!
స్పష్టమైన ఉచ్చారణతో విలసిల్లి, విస్పష్టంగా విన్పించు భాష!

రస భావముల నందించుటలో, అమర భాషకు దీటైన భాష!
ఎల్ల భాషల వన్నె చిన్నెలు పుణికి పుచ్చుకొని అమరిన భాష!

అక్షర సంపద కుప్ప తెప్పలుగా కలిగి వున్న భాష!
"ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని బిరుదు పొందిన భాష

పది భాషలు తెలిసిన ప్రభువుచే, భాషయన "నిద్ధియని" చెప్పబడిన భాష!
ఛందస్సులోని యందమ్ముల నడక తీర్చి చూపించిన భాష

రసరాజైన త్యాగరాజు, తన స,రి,గ,మ,ల కోసం ఎంచుకున్న భాష!
సంగీతంలోని సప్త స్వరాలను అలవోకగ పలికించిన భాష!

జుంటి తేనె కన్న, జున్ను కన్న మధురమైన భాష!
పనస తొనలకన్న, పంచదార కన్న తీయనైన భాష!

అదే మన మాతృభాష, తీయని తెలుగు భాష!